శ్రీ

# కృష్ణలీల నాటకము.



ఇయ్యది

సంపూర్ణమహాభారతము, లవకుశ నాటకములు రచియించిన

బళ్లారి పండిత, కె. సుబ్రహ్మణ్యశాస్త్రిలుగారిచే

రచియింపఁబడినది.



ప్రకటనకర్త:

కుడుకూరి సుబ్బారావు,

సరస్వతీ బుక్కు డిపో,

బెజవాడ—కృష్ణాజిల్లా.

అయిదవకూర్పు 1000 ప్రతులు.

కాకినాడ:

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1929

 పోస్టేజీ ప్రత్యేకము. వెల రు 1—4—0

# ప్రకటన.

ఇందువలన సూచించుట యేమనగా నాచే విరచింపఁబడి ప్రకటింపఁబడిన ఈ శ్రీకృష్ణలీలా నాటకమునకు గల సర్వస్వాతంత్ర్యము లు క్రొత్త కాపీరైటు ఆక్టుప్రకారము నాకుఁ జెందియున్నవి. దీనిని భాషాంతరీకరణ మొనర్పవలయునన్నను లేక ఖేలన మొనర్ప యునన్నను నాయనుమతిని వ్రాతమూలమున పొందవలెను. అటుగా స్వతంత్రించినవారలు నానష్టమునకు పాత్రులగుదురు.

బళ్ళారి,
1—7—1929.

పండిత కె. సుబ్రహ్మణ్యశాస్త్రి

---

శ్రీగోపాలకృష్ణాయనమః

## నాంది.

శా॥ శ్రీరాజిల్లయశోదయంకమున వాసింగాంచి కంసాదులన్
పేరారంగనుజేసి పార్థసఖుఁడై వేదాంతతత్వంబు నే
పారన్ దెల్పుచు గోపకాంతలకు నిత్యామోదసంధానుఁడౌ
నీరేజాక్షుఁడు గోపబాలుఁ డొసఁగున్ నిత్యాయురైశ్వర్యము

శ్రీ

# కృష్ణలీలనాటకము.

## ప్రథమాంకము—ప్రథమరంగము

క్షీరసాగరము.

[విష్ణువు వరుండియుండును—ఇరుప్రక్కల బ్రహ్మాదిదేవతలు నిలిచి స్తుతించుచుందురు.]

(అనుబంధము 1.)

విష్ణువు—కమలాసనా! దేవనాథా! మీకందఱికిని గుశలమా? స్వర్గరాజ్య మేయంతరాయమును లేక పాలింపఁబడుచున్నదా? నీవజ్రధార దానవుల శిక్షించుటయం దజాగ్రతఁ బొందియుం డదుగదా? బృహస్పతియుపదేశము నీ కామోదము నిచ్చుచున్నదా? రాక రాక మీరందఱు నిచ్చటికివచ్చుట యేదో యొకవిశేషమును సూచించుచున్నది.

మ సురలారా! కుశలంబె మీకు, శుభమే చుట్టాలకున్, సేమమే తరుణీవారములున్, ప్రమోదులెసుతుల్, దైత్యుల్ నిరోధింపరే అరుదయ్యెన్గద మీరువచ్చుట మనోహాసంబు చేకూరె భా సురవాంఛన్వచియింపుఁ డిచ్చ్వద మనస్ఫూర్తిన్ వరాజ్ఞాసనా.

సీసమాలిక.

విష్ణు—ధరణీసురాదత్తవరహవిర్భాగముల్ కొనుచు మోదింతురే యనఘులార?

బ్రహ్మ—క్రతువులుండినగదా క్రతుభాగములుగల్గు క్రతువ్రులునీటిలో హుతములయ్యె.

విష్ణు—ఏకోర్కెకై మీరలిచటికేతెంచితి రెలమి శంకింపక దెలుపుఁడయ్యా.

ఇంద్ర—నిన్నుఁజూచుటకంటె నున్నదే వేరొక్క కోరిక మాకెందు నీరజాక్ష ?

విష్ణు—ఎంతప్రార్థించిన నేగుదేరని మీర లరుదేరనాశ్చర్య మమరినాకు.

నారదు—ఆశ్చర్యమంతయు నమరునీయందె, నీవెఱుగని యాశ్చర్యమేమి కలదు.

విష్ణు—పురుషార్థ! వేఁడుము మోక్షమైననునిత్తు నీ భక్తి మదినాకు మెప్పునించె.

మీస్తుతిజాలముల్ మీదుమిక్కిలి నన్ను అలరించెగా నేఁడు అమరులార !

నారదు—గీ. అధిపమోక్షమునిందురిని కపుడగలిగె,

విష్ణు—ఎట్లు నీమాట నారదా ?

నారదు—యేమిచెప్ప, తనర నా కంస శిశుపాల దంతవక్త్రులిచ్చిరి కపాలమోక్షంబు నిందిరేశ.

బ్రహ్మ—దేవా ! నీపరిపూర్ణానుగ్రహము మమ్ముల నెపుడు బాలించుచుండ మాకశుభమెక్కడినుండి రాఁగలదు ? అయినను భూలోకమున కంసాదిరాక్షసులు పెల్లుపెరిగి చెలరేగి గోబ్రాహ్మణుల హింసించుచున్నవారు, అందువలన యజ్ఞయాగాదిక్రతువు లొక్కటియులేక మేమందరము హావిర్భాగంబులు లేక యున్నవారము.

భూదేవి—దేవా! నీయాజ్ఞచే నేను సకలపర్వతసరిత్సముద్రములవహించుచున్నదానగాని యీదుష్టకంసాదిమహాపాపులను వహిం

పఁజాలను. లోకనాథుఁడవగు నీవే యిట్లు కన్నులుమూసికొని యున్న నింకెవ్వరికి శరణొందువారము.

(అనుబంధము 2)

వేంద్రి—రమారమణా! ఈ పితామహుఁడును, నీభూదేవియు నిటుల మేనలేనిచింతలపాలైయుండ నింక నాగతియేమని విన్నవించువాఁడను? కంస, శిశుపాల, దంతవక్త్రాదులెల్లప్పుడును నాదేవపురిపై దండెత్తుటకై యెంతయు నాలోచించుచున్న వారు. అందున కంసుఁడనురక్కసుఁడు ప్రపంచమునంతయు బాధించుచున్నవాఁడు. వానిదాడికి వెఱచి యహోరాత్రములు వజ్రాయుధము చేనుంచుకొని కనుఱెప్పవలె నాలోకమును రక్షించుకొనుచున్నవాఁడ. దేవా! నీ వీయిడుముల బాపకున్న మాకు సుగడ కలుగదు. ఇందుకై యీలోకములాసనుని వేఁడి యతనిపురస్కరించుకొని నిను శరణొందవచ్చియున్నారము. అలనాఁడు హిరణ్యకశిపురావణాదుల పొలియించి మమ్ముగాపాడిన నీదయారసము మాపైఁ బ్రసరింపఁజేయుము. నీవుగాకున్న మమ్మెవ్వరింక గాపాడుదురు?

చ. కనులకునిద్రరాదు భయకంపితమానస మారడిల్ల దా
ఘనసురరాజ్యసౌఖ్యములు కానఁగరా వటయజ్ఞభాగముల్
వినుటకునైన లేవు బలువేఁడుక లేదు రమాపతీ! జగం
బనయము కంసురాయడికి నక్కటచిక్కె తలంచిబ్రోవవే.

ము—పురందర శతానందులారా! భూదేవి! యూరడిల్లుఁడు. నేనిది వఱకే యాలోచించియున్నవాఁడను. నారదునివలన నీవృత్తాంతములనెల్ల నెఱిఁగి యున్నాఁడను. నాభక్తులై భూలోకమున నుదయించిన దేవకీ వసుదేవులమనోరథము నీడేర్ప వారినందనుఁడనై శ్రీకృష్ణుఁడనుపేర భూమియందుదయించి మీకష్ట

ముల బాపువాఁడను. మీరేమియు నాలోచింపకుఁడు. కుమారా! నాయంశమున నీయాదిశేషుఁడు బలభద్రుఁడై జనించువాఁడు. నీవీగీర్వాణసముదయంబునంతయు యాదవులుగ జనించునట్లుఁ జేయుము. ప్రేయసీ! ఇందిరా! యేమిట్లూరకున్నదానవు? నీసంకల్పమునఁగదా నామనోరథము లీడేరును? నీవు లేకున్న నాకవతారములే ఘటిల్లఁజాలవు. కావున నాకెంతయు సైదోడుగనుండి యీదేవతలపరితాపము మాన్పుము. నీవు నందగోకులమున నందుని భార్యయగు యశోదయందు జనింపుము. నీమాయచే నాకంసుని కన్నులగప్పి నన్నెఱింగించి నాటనుండి భూలోకమున శక్తిస్వరూపిణివై నానాభక్తుల పూజలఁగైకొనుచుండుము. మఱియు రుక్మిణివై జనించి నా వామభాగ మలంకరింపుము.

బ్రహ్మ — భాగ్యము. దేవతలారా! మనమీదేవదేవుని నింతప్రార్థింతము.

(అనుబంధము 3)

---

ప్రథమాంకము — ద్వితీయరంగము.

మ ధు రా ప ట్ట ణ ము.

వివాహమంటపము.

[ఉగ్రసేనుఁడు, మంత్రులు, విప్రాదిసజ్జనులొకప్రక్కను, పౌరులొకప్రక్కనను కూర్చొనియుందురు. దేవకీవసుదేవులుపీఠమునకూర్చొనియుందురు. కంసుఁడు ప్రక్కన నిలిచియుండును. బ్రాహ్మణులు మంత్రాదినియమముల నాచరించుచుందురు ]

కంస—బ్రాహ్మణులారా ! చాలింపుఁడు మీయధికప్రసంగములు, మంత్రులారా! యీ బ్రాహ్మణులకుఁ దగినబహుమతులిచ్చి యనుపుఁడు.

గాలవ—కంసప్రభూ! నేను చిరకాలమునుండి నీపురోహితుఁడను. ఇట్టి లగ్నకాలమున నాకెక్కువ బహుమానము రావలయు.

కంస—అందునకే నీ కేబహుమానము నీనాఁడు రాఁజాలదు. ఊరక మాటాడకపొమ్ము.

గాలవ—చిత్తము.

బ్రాహ్మ—దేవా! నేనధ్యాపకుఁడను. నాకు—

కంస—వెఱ్ఱిబాపఁడా! నీకేమిచెప్పుడా? నీకెక్కువబహుమానము వేఱ కావలయునా?

బ్రాహ్మ—మహాస్వామీ ! ఏమియువలదు.

శ్రీసేన—(దేవకి యొద్దకు వచ్చి) అమ్మాయీ! నేఁడు నీవు నీవలచినపతితోఁ డగూడి యీడు లేనిమోదమున్నమట మాకందఱికిని సంతసమే యగు. తల్లీ! నీపతియింట పరమసాధ్వీగుణముల నెట్లు చాటించెదవో, నీ సౌశీల్యము నెట్లు ప్రకటించెదవో, కులసతీమహిమంబును వెలిపరచి పుట్టినింటికిని మెట్టినింటికిని మెప్పైనలేని కీర్తిని ఘటించెదవో ? తనయా ! పతినే దైవముగ భావించి పతిశుశ్రూషయే మోక్షమార్గముగ నెంచి, పరమపతివ్రతాశిరోమణివై వెలుఁగొందుము. అత్తమామలఁగాంచిన మమ్ముఁగాంచినట్లు కడుగారాబమున బరిచర్యం జేయుము. మఱందులయెడ పుత్రవాత్సల్యముంచి వారిఁగరుణచేనరయుము. బంధువులయందు, సంపద కలిగినప్పుడును, వారి బీదఱికము సంభవించినపుడును, సమభావనచే సహోదరప్రేమంబును ఘటింపుము.

దేవకీ! భర్త నీయెడ నెంతకోపగించినను, యెంతదూషించిన ను, యెంతబాధించినను పతిభక్తిని మఱువకుము. భామలకు లోకమున పతియే దైవము; పతియే వ్రతము; పతియేతపము; పతియే సర్వధర్మములని వేదములు బోధించుచున్నవి. కావున పతిభక్తిపరాయణవై యుండుము. పతి శయనించినతఱువాత శయనించి, పతి నిద్రలేవకమునుపు నిద్రలేచి, పతిభక్తిభావన మున మెలంగుకులాంగనలకు జపతపాదులన్నియు నిరర్థకముల గుఁగదా? కుమారీ! రేపు తొలిజామున నే పయనము కావల యు నిన్ని దినములు బోషించితిమి. పెంచిపెద్దజేసితిమి. ఇపు డు నీపతివెంటఁబంపుచున్నారము ఇఁక మమ్ములమరచిపొమ్మి. పుత్రికావాత్సల్యమున నిన్నను పజాలకున్నను మన సనాతనధ ర్మముచే పుట్టినిఁట నుంచికొనగూడమిచే నిన్నుబంపుటకెంత యో మనసు రాయి చేసికొని పంపుచున్నారము. అమ్మా! నిన్ను మేమెంత కోపగించియుండినను మఱచిపొమ్ము. బుద్ధి గ అపుటప్పుడెయెంతశిక్షించియుండినను వాటినెల్ల మనసునసుంచ కుము. నీజన నీజనకుల నప్పుడప్పుడు స్మరింపుము. పోయిరమ్ము. మఱల పుత్రవతివై మధురాపట్టణమునకుఁ జేరుదువఁట లెమ్ము. మీయన్న కంసుఁడు నిన్ను బదిలముగా వీడ్కొని రాగలఁడు.

సీ. ఘనభక్తిసంజార కని యుత్తమామల
కెలమి శుశ్రూషల సలుపుమమ్మ
పతిని దైవముగాగ భావించి యెప్పుడు
పతియాజ్ఞజవదాట వలవదమ్మ
తోడికోడండ్ర నీ తోబుట్టువులఁబోలె
సుదతిరో! బల్ప్రేమఁ జూడుమమ్మ

పరిచారికులఁగన్న నిరుపేదలనుఁగన్న
కన్నపుత్రునిఁబోలెఁ గాంచవమ్మ
గీ. అతిథిపూజల మదినెందు నరయుమమ్మ
పరుషభాషలనెవ్వాడు పలుకకమ్మ
దేవకీ! మాకు సత్కీర్తి తేగదమ్మ
పోయిరావమ్మ శుభముల పొందుమమ్మ.

వసుదేవా! ఈబిడ యేమియు తెలియని ముగ్ధ, బాల, కావున దీని
కరుణచే నరయుము.

వసుదేవ—అయ్యా! తమయానతిమేరకు వర్తించెద. గృహస్థాశ్రమ
ధర్మములఁ గొన్నిటి మిముఁబోలు ధర్మజ్ఞులవలన వినియున్నాఁ
డను. మీయుపకారము నే నెన్నఁడును మఱువను.

చ. కరుణను బ్రోచితయ్య, యుపకారము మీఱెగదయ్య, నీవు నా
దరమున కన్యనిచ్చి గృహదానము చేసితివయ్య, నీకృతజ
మఱతునెటయ్య? నీతనయ మన్నన ప్రేమను పెంతునయ్య మ
మ్మిరువుర నాశిషంబులను నిచ్చి మహోన్నతిఁబంపు మయ్యరో!

దేవకి—అయ్యా! మీ యుపదేశము నన్నెంతయు కృతార్థనుఁ జేసెను.
నేనెటు మిము బాసిపోవఁగలను? ఆత్మసుఖంబుల నించుకైన
గణింపక, యాయాసముల లెక్కింపక, కడుప్రేమచే పోషించి,
విద్యాబుద్ధులనేర్పిన జనకులబాసి యెట్లు పోవుదును? తండ్రీ!
నేనెంతయు ముద్దుగా బెంచుచున్న నామ ద్రుమలతిక గర్భవతిగా
నున్నదిగదా? దానినెట్లు డించిపోవుదును? ఓసఖులారా! రా
యంచలారా! నాకిఁక సెలవిండు.

సీ. కడుప్రేమ నన్నింతకాలంబు పాలించి
దయను పెంచిన తల్లిదండ్రులార!

తోడునీడలఁబోలె తోఁబుట్టువులఁబోలె
నను బ్రాయని సఖీజనంబులార!
నేభుజించినగాని నిర్మలదాడిమీ
ఫలములగొనని యోచిలుకలార!
నడయాడు నేర్పుల నాకుబోధించిన
న్నలరించు నో రాజహంసలార!

గీ. నేఁడు మిముఁ బాసి పతియింటి కేగుదాన
మమతమరువంగవలదు నోమాన్యులార!
హరిణశిశులార! గురులార! యమలులార!
పరగ నాకింక సెలవిచ్చి పనుపుఁడయ్య.

ఉగ్రసేన—కుమారీ! మఱల కొలదికాలములో నే నిన్నుఁగాంచెదము కదా? యోచింపకుము. నీ పెంపుడుజింక ప్రసవించినవెంటనే నీ కావృత్తాంతముఁ దెలియపరచెదను లెమ్ము. శుభముగ పోయిరమ్ము. మీగురువులకును వందనీయులగు వారి కందరికిని నమస్కరింపుము. నీవునుఁ జక్కనికుమారునితోఁగూడి నీజింక నాదరింతువఁట లెమ్ము.

దేవకి—(అందఱికిని నమస్కరించును, ఆశీర్వదింతురు.)

(అనుబంధము 4)

---

ప్రథమాంకము—తృతీయరంగము.

అ ర ణ్య ము.

[ప్రవేశము: కంసుఁడు సైన్యముతో. రథముపై దేవకీవసుదేవులు.]

(అనుబంధము 5)

కంస—సైనికులారా! మీమీశిబిరముల నిచ్చటనే నిలుపుఁడు. ఇదె మధ్యాహ్నముకావచ్చెను. చండభానుఁడు చండతరకిరణుండై

పాంథులను, వనతరుబృందములను నెంతయు బాధింపఁజొచ్చెను. ఆతపము కనులకు మిఱుమిట్లుగొలుపుచు తేరిచూడ రాకయున్నది. సమస్తదిశలు శూన్యములై కానవచ్చుచున్నవి. ఎండమావులు తమనడబెడంగుచే పైపైఁ బారుచు బాటసారుల నెంతయు వంచించుచున్నవి. కానిండు, ఈసూర్యుఁడు మిగులపొగరెక్కి మింటవిఱ్ఱవీఁగుచున్నవాఁడు. తొల్లి హిరణ్యకశిపు రావణాదులు వాని కండకావర మణచియున్నను మిడిదేరి మఱల మఱల "మత్సమోనాస్తి" యని నన్నింతయైన లెక్కగొనకున్నవాఁడు. మీమీరథతురఁగపదాతుల నందలి విస్తారవృక్షచ్ఛాయలయందు విడియునట్లుచేయుఁడు. వెనుక వచ్చుచున్నరథముననున్న దేవకీవసుదేవుల నదె యక్కడ గాన్పించుచున్న లేమావికాంతారమ్మునడిపి వారికి యనువగు నుపచారములఁ జేయ తగినసేవకుల నియోగింపుఁడు. నాశిబిరముసైతము వారి విడిదిదాపున నుండునట్లు చేయుఁడు. పోండు. నే నీవృక్షచ్ఛాయలఁ గొంచెము విశ్రమించివచ్చెదను.

సైనికులు—భాగ్యము.

(నిష్క్రమము.)

కంస—ఆహా! నాపేరు విన్నమాత్రమున సకలగీర్వాణబృంద మదే జగత్ప్రళయమని భావింతురు. ఇఁక భూలోకమన్ననో నా కరతలమునకుఁజిక్కి సముద్రమందలి తరంగములవలె తల్లడిల్లుచున్నది. ఆదేవేంద్రునిఁ గడతేర్పవలయునని యతిదృఢప్రయత్నముల నేఁ జేసియున్నను నావిష్ణువు వానికి సైదోడుగ నుండుటచేత నాయుద్యమ మంతటితో నెఱవేఱదయ్యె. ఇంక నచిరకాలములో మొదట నాహరిని హరించుటకై దండు

వెడలవలయునని యున్నవాఁడ. అప్పుడిందుఁడు మృతప్రాయుఁడే కాగలఁడు. ఏప్రయత్నముచేతగాని కార్యము నెఱవేర్చినగదా పురుషసింహుఁడనఁబోలును? అయిన, నన్ను లోకులందఱు దుష్టకర్ముఁడని పరిపరి నిందింతురు. నాచెవులకు నామెదుట నాడకున్నను లోలోననొచ్చికొనుచు నన్నెంతయో నాడికొందురు. పదరికొనని, శునకముఖులు సింగంబును పరిహరించునే? ఇఁక నాముదుసలితండ్రియో ఇదిధర్మము, ఇదియధర్మము, న్యాయము, అన్యాయమని యెప్పుడుచూచినను మూలనుఁగూర్చొని పదరుచుండును. ధర్మమనఁగనేమి? అధర్మమనఁగనేమి? మంచిమాటలకు మామిడికాయలురాలునే? మత్తేభేంద్రపరంపరలపై నురికిన హర్యక్షుంబుపగిది లోకులపైనెత్తి కసిదీరచక్కాడి, బాధించి, వేధించి, సంహరించి, తల్లడిల్లునట్లుచేసినఁగదా కంసుఁడన్న లోకంబులన్నియు నిర్ఘ్ణములగును? "మెనకేనాప్యుపాయేన ప్రసిద్ధః పురుషోభవ" యనిగదా నీతిశాస్త్రము ఘోషించుచున్నది.

(లోపలధ్వని-అనుబంధములోనిపల్లవి. 6)

అహా! ఇదియేమి? నారదుఁడు వచ్చుచున్నట్లున్నది? రానీ చూచెదనుగాక.

[ప్రవేశము—నారదుఁడు హరిగానముఁజేయుచు]

(అనుబంధము. 7)

నారద—అహా! ఏమి యీకంసుఁడు క్రోధానలమూర్తియైయున్నవాఁడు? వీనితో మాట్లాడ వలయునన్న భయమగుచున్నది. అట్లైన నా కార్యము సఫలమగుటెట్లు? కాని.

(అనుబంధము. 8)

కంస—నారదా! రమ్ము. కూర్చొనుము. (అనఁగా నారదుఁడు దూరముగా కూర్చొనును) నారదా! సమీపమునకు రమ్ము.

నారద—కంసరాజేంద్రా! దూరమేమియు లేదు. ఇక్కడనే యుండెదను. నీకు క్షేమమా ?

కంస—"క్షేమమా?" ఏమట్లడిగెదవు? క్షేమముగాక అక్షేమము కలిగించువాఁడెవఁడు ?

నారద—భాగ్యము. ఇంకొకతూరి యడుగను. ఏమి కడుసంతోషముతో కూర్చొనియున్నావు.

కంస—నారదా! సంతోషము నాయదిగాక యింకొకరికి గలుగునా ?

నారద—నిజము సంతోష మొక్కటియేగాదు. ప్రపంచమే నీయది. కాని యెచ్చటికి నీప్రయాణము ?

కంస—నాచెలియలగు దేవకిని యామెపతియగు వసుదేవుని పురముఁ జేర్చివచ్చెదను.

నారద—(నవ్వును)

కంస—నారదా! ఏమి నవ్వెదవు ?

నారద—నవ్వువచ్చిన నవ్వితిని.

కంస—అకారణహాస్యమా ?

నారద—అకారణమేల ? సకారణమే.

కంస—ఎవరు కారణము?

నారద—నీవు.

కంస—నేను కారణమా? ఎట్లు?

నారద—నీవుగాకపోయిన నీబుద్ధి.

కంస—నాబుద్ధియా?

నారద—అదియుగాకపోయిన నీయవివేకము.

కంస—నారదా ! ఏమి నీమాటలు చిత్రముగానున్నవి ! నా యువి వేక మేమి?

నారద—చంపు పగవానిని( దానై వెతకి కొనిపోవుట యువివేకము కాదా ?

కంస—నాకు పగవా(డెవ(డు ?

నారద—ఇం కెవ్వరు? నీ చెలియలగు దేవకియే.

కంస—నా చెలియలు నాకు పగదాయి యెట్లు?

నారద—ఆమె కాకున్న నామెగర్భమున జనించు నష్టమపుత్రు(డు నీకు పగవా(డు కాగల(డు.

కంస—నారదా! మానవు( డన(గనేమి? నాకు శత్రు వన(గనేమి ? పురందరాదులు తమయాండ్రమంగళసూత్రమును చేతనుం చుకొని యనవరతము నన్ను స్మరించుచుందురు. నిర్భీతిగ చెలరేగి భువనసముదయంబుల నదమద మొనర్చు నీమ త్తగ జేంద్రమున కొకపగవాని( గల్పించితివా ? నీబుద్ధి నీస్వాధీన మా సున్నట్లు లేదు.

నారద—నాకు బుద్ధిస్వాధీనము లేదా ? నీయదృష్టము నీకు స్వాధీన మునలేదా? నీకు శత్రువై జనించువా(డు మానవు( డనుకొం టివా ? అత(డు మానవు(డు కాడు. రాక్షసు(డు కాడు. వా చామగోచరు(డు. దుష్టశిక్షకు(డు. శిష్టరక్షకు(డు. వేదాంత వేద్యు(డు. దేవు(డు. నీకొఱకయ్యె మీ దేవకిగర్భమున జనిం చువా(డు.

కంస—వానిపే రెయ్యది? వా( డేల నాకొఱకై జనించును? సవిస్త రముగా( దెల్పుము.

నారద—నాకు దీర్ఘసంవాదమున కవకాశము లేదు. నేను బ్రహ్మలో కమునకు పితామహు(జూచుట కేగవలయు, ఒక్కరహస్యము

చెప్పెదవినుము. ఏసున దేవతులందఱు నారాయణునితో మొఱపెట్టుకొనగా నాదేవదేవుఁడు నిన్నును, నిన్నుఁబోలిన వారిని సంహరించుటకై నీసహోదరీమణియగు దేవకీగర్భమున జనించువాఁడంట. నేను మొన్ననే వైకుంఠమున నీయుదంతము వింటిని. విన్నసంగతి నీకుఁ జెప్పితిని.

కంస—నారదా! నన్ను బెదరించెదవా? నారాయణుఁడా నన్ను సంహరించువాఁడు? వాఁడు చెప్పినమాత్రముననే యీకర్ణకంటకములగుమాటల నీ వెట్లువింటివి? నీవును నాప్రతిపక్షులతోఁ జేరితివా? నీకేల బుద్ధి చాలదయ్యె? అప్పుడే యీజలమృగమగు కేశవునికి మదీయ ప్రతాపప్రభావంబు నేల యెఱిఁగింపకపోయితివి? నిన్నుపేక్షించినందుకుగదా నీ వింత నిర్లక్ష్యభావమున సంచరించెదవు?

(అనుబంధము 9)

సీ. క్రతుసంతతులనార్చి వ్రతసంతతులనోర్చి
ఘనతమించుట యింతకనెనో లేదో?
కలవాణులనమించు లలనామణులమించి
వెలనారులనుసేత వినెనో లేదో?
ఖలవాదములమీఱి యిలవేదములదారి
నడలింప బలువంతపడెనో లేదో?
అలపొంద జనబృందముల నందరానట్టి
యిడుములబడద్రోయు టెఱుఁగ లేదో?

గీ. నన్నుఁగన్నాఁడో యేమంచుచున్నవాఁడో?
తెలియకన్నాఁడో తెలిసియే పలికినాఁడో?
పుట్టనున్నాఁడో యీహరి పుట్ట లేదో?
బుద్ధిచెప్పుము నారదా! యుద్ధమేల?

నారద — (స్వగతము.) అయ్యో? ఇది యేమి గ్రహచారము నాకు? చెప్పవచ్చిన పీఁడు నన్నే కోపగించుచున్నవాఁడు. (ప్రకాశముగా) పరితాపశిరోమణీ! నావలన తప్పేమియు లేదు. నే నా విష్ణువుతో నీవిషయమంతయు స్తోత్రముఁజేసి చెప్పియున్నాను. నీమహిమ యట్టివారికిఁ దెలియునా?

చ. జలమట వానియిల్లు జలజాతమటన్ మరివానియూలు నా
జలజభవుండటన్ సుతుఁడు పారజలంబట వానియంగ మా
జలజవినేత్రు డాజలవిచారుఁడు నీఘనవిక్రమంబునన్
తెలియఁగజాలునే మదిని దివ్యపరాక్రమ కంసచంద్రమా.

కంస — భళిరే నారదా! నీవుకదా నామెచ్చునకు వచ్చువాఁడవు.

నారద — నే నిఁక వెడలివచ్చెదను.

(అనుబంధము 10)

(నిష్క్రమించును)

కంస — (కొంచెమాలోచించి) ఆహా! నేఁడెట్టి యుదంతము వినఁగంటిని? ఇన్నిదినములు సమంచితవిఖ్యాతనై లోకశాసనమును కొనవ్రేలియందిడుకొని సకలరాజరాజకిరీటమణివిద్యోతితపాదారవిందుఁడనై యున్న నాకు నేఁడు కర్ణకంటకములగు "శత్రు" వనురెండక్షరములు వినఁగలిగెగా? అందును నెందో యెచ్చటనో కాక నాప్రియసోదరియందు నాశాత్రవుఁ డుదయించునన్న నిదియేమి విపరీతమనవలయు? ఆగీర్వాణులు తన సన్నిధానమున మొఱయిడినమాత్రముననే యా నారాయణుఁడు నన్ను సంహరింప సమకట్టెగా? వాని నామిత్రులిదివఱకే సమయించియుండిన నాకింత భీతియుండదుగదా? లేక నారదుఁ డేమైన నాకెనలేని భయవిభ్రాంతిగలిగించుటకై యీకల్పనాకథను పన్నియుండునా? ఇట్టి యపోహవార్త కల్పించుట కతని కేమియక్కర? ఇదియథార్థమనుటకు సందియము

లేదు. ఆహా! ఈదురంతశాత్రవచింతారోగము కుదుర్చుకొన్నఁగాని నామది కించుకయూరటగలుగును? నే నిప్పుడే నాశత్రుసర్పమున కాధారమగు నాదేవకీవల్మీకము నట్టె ధ్వంసముఁ జేసి నామనశ్చింత బాపికొందునా? అయ్యో! నాకెట్టిపాపబుద్ధి కలిగెను? నాకుఁ దోఁబుట్టువై నే కడుగారాబమున బెంచిన చెలియలై నే నెంతయుఁ గూర్చు సోదరియైన మాదేవకిని నేను కడతేర్పవలయు ననెడిబుద్ధి కలిగెగా? అకటా! యెంతపాపమున కొడిగట్టితిని? ఔరా! ఈతుచ్ఛమగు పిచ్చిపామరమను విషమును వెదఁజల్లి నాజీవితమును పాడుఁ జేసికొనఁ బోలునా? చెల్లెలగుఁగాక తల్లియగుఁగాక! తనయాపదలకు మూలమగువస్తువును బరిమార్పకుండుట ధీమంతునిలక్షణమగునా? కట్టా! నాయొక్కని మనుగడకై యెవరో చెప్పినయొకకల్లవృత్తాంతమును విని నాముద్దుసోదరిని ఖండింపఁబూనుట యగునే? ఆనెలతకై తల్లిదండ్రులొకక్షణమైన జీవింపఁగలుగుదురే? నారదునివాక్కులు తథ్యములైనను నాశత్రువును తుదముట్టించుటకై వేఱొకయుపాయముగలుగదా? (కొంచెమాలోచించి) ఆహా! వేరేమియు నాలోచన పాల్పడదుగదా? ఏమిసేయుదు? ఔరా! దాక్షిణ్యమును, గరుణను యోచించిన ప్రయోజనముండునే? మాయింటనుంచక పరునియింటికిఁ బంప యోగ్యమైన యొకయాడపడుచుకై తుదలేనిదుఃఖసాగరమును నీదవలయునా? ఇతరులయింటికి బంపుటకు మారుగా యమునియింటికే పంపెదనుగాక. నాకెంతయు బల్లెముఁ బోలె బాధించు చెల్లెలున్న నేమి? చన్న నేమి? ఇదియే నిర్ధారణము. మున్ముందు రానున్న నా ప్రాభవకీర్తిచంద్రిక కింతరాయకరధ్వాంతసముదయ మేమివచ్చినను, మేరుమందరము లడ్డపడినను మత్కార్యసాహసమును వదలను. మాన

న. హీనములై మానవుని యభ్యుదయలక్ష్మీలతాలవిత్రము లై, ప్రసిద్ధశాలికావిమపాత్రములై యొక్క కరుణా, దాక్షిణ్య, ప్రేమములను తుచ్ఛభూతములను మదీయ్య ధైర్యవిజ్ఞానఖడ్గంబుచే నాశనమొనర్చెదను. కార్యసాఫల్యసంతోషరాజ్యమేలెదను. క్రౌర్యసాహసపరాక్రమములను కరతలామలకముగాఁ గొనెదను. దిజ్మభోంతరాళంబుల నెందును కంసుఁడను నామమంత్రంబును జాటెదను. సకల గీర్వాణస్తోమంబుల దుఃఖద్యమంబుల నాపాదాహతి నలచెదను. మత్క్రోధ ప్రళయానలజ్వాలలకు నీభువనంబుల నాహుతిఁ జేసెదను. ఇదే వెళ్ళెదను.

(అనుబంధము 11)

(పాడుచు నిష్క్రమము.)

---

ప్రథమాంకము—తురీయరంగము.

అ దే య ర ణ్య ము.

[ఒక వృక్షచ్ఛాయయందు దేవకీ వసుదేవులు కూర్చొనియుందురు.]

(అనుబంధము 12)

వసుదేవ—ప్రేయసీ! దేవకీ! చూచితివే యీ కాంతారము? చూపరులకు నెంతయో వింతఁగొలుపుచున్నది. ఈ గిరికందరముల నుండి ప్రవహించెడి సెలయేర్లు తమ జలబిందువులచే మార్గశ్రాంతులకు కడుంగడు శీతలసుఖ మొసంగుచున్నవిగదా? లోకమున బుద్ధిశక్తిలేని యీ నదీనదములే పరోపకారమొనర్చి తాము కటికటాలఁ బడియైనను ప్రజలకు సంతసముఁ గలిగించుచుండ నీ లోకు లొకింతయేని పరోపకారముఁ బూనరుగదా?

దేవకి—నాథా! నిజము. లోకమున దైవమిచ్చిన బుద్ధిగలవారికంటె బుద్ధిలేని వస్తువులే మేలుగాఁ దోఁచుచున్నవి. అంతయేల? మనమిప్పుడు కూర్చొనియున్న మఱ్ఱివృక్షమునుఁ జూడుము. మనము మధురాపట్టణమునుండి యెంతదవ్వరుదెంచినను మనకు మార్గాయాసము నింతేనిఁ దోఁపనీయక యాసూర్యావిరాయిడికిఁ దనపర్ణములసాచి మనలను గాపాడుచున్నది.

వసుదేవ—బాగుగానుగ్గడించితివి రమణీ! ఏమి సూర్యుఁ డపరాంబుధిఁ గ్రుంకుచున్నవాఁడు కంటివే?

సీ. అపరదిక్కామినీ విపులకేశభరంబు
పై నొప్పునరుణంపు పద్మమనఁగ
గగనరామామణి సొగసారు మొగముపైఁ
బొలుపారు కుంకుమబొట్టనఁగ
భూసతి కనకాద్రి పుత్త్రికు నాడింప
ప్రక్కఁగట్టిన కెంపుపతకమనఁగ
దేవాంగనలుచూడ దివి యందుకట్టిన
ముద్దారు మాణిక్యముకుర మనఁగ
గీ. సర్వకాలంబు వెలిగెడి చక్రమనఁగ
మంత్రయోగులు పూజించు యంత్రమనఁగ
పరగుబలుకెంపుదీపు భరణియనఁగ
పశ్చిమాంబుధిఁ గ్రుంకెడు భానుఁగంటె.

దేవకి—ఔను. అప్పుడే సాంధ్యరాగము కనుపించుచున్నది.

వసుదేవ—ఇంక మనము పయనము సాగించుట మేలనితోఁచుచున్నది. ఏల మీయన్న కంసుఁడింకను రాలేదు?

దేవకి—(అటునిటుచూచి) అదిగో! దూరమున వచ్చుచున్నట్లున్నది.

[ప్రవేశము:—కంసుఁడు ఖడ్గము నెత్తి మహాకోపముతో పాడుచు.

(అనుబంధము 13)

[కంసుఁడు దేవకీదేవిని జడపట్టి యీడ్చి ఖడ్గముపై కెత్తి చంప ప్రయత్నించును. వసుదేవుఁడు భయభ్రాంతుఁడగును.]

దేవకి—(గడగడ వణఁకుచు) అన్నా! అయ్యో! అయ్యో! ఏమి నన్నుఁ జంపసాహసించితివి?

కంస—నీవు చెల్లెలైన నేమి? నీగర్భమునుండి నాకు శత్రుఁడగువాఁడొకఁడు జనింపఁగలఁడఁట. కావున నిన్ను సంహరించి శాత్రవబాధ లేకుండఁ జేసికొనియెద.

దేవకి—అన్నా! ఎవరుచెప్పిరి? ఏ బాలిశుఁడు చెప్పెను? అట్టివారి మాట విని నన్ను సంహరింపఁజూచెదవా?

(అనుబంధము 14)

కంస—ఎవ్వఁగననేల? ఎవ్వరో యాకసమునుండి చెప్పియున్నారు. నేనేమిసేయుదు? నీ ప్రాప్తి యిట్లున్నది. నిన్ను మానను.

(అని ఖడ్గము పైకెత్తును. దేవకి "నాథా; నాథా" యని మూర్ఛఁ బోవును.)

వసుదేవ—బావా! ఏమి యీ విపరీతము? నీ ముద్దుసోదరిని సంహరింపఁజూచితివే? ఇప్పుడేగదా, అతి సంతోషమున మమ్ము యువురిని నూఁఱుదేర్చుటకై నీతండ్రి నిన్నంపెను? ఇంతలో పిట్టపిడుగున నీకిట్టి దుర్బుద్ధి రాఁజెల్లునే? ఇదెక్కడి మాట? అబ్బెలుమాటలనా నీవు నమ్మినది? అట్టిమాటలకై యెంత ఘోరకృత్యముఁ జేయఁ బాల్పడితివి? అయ్యో! అన్నవైన నీవు చెల్లెలికి మాడలిచ్చుటో, వస్త్రములనొసంగుటో, కనక భూషణంబు లర్పించుటో, యివన్నియుమాని వాటికన్నిటికిని

ప్రతిఫలముగా నీ చేచేత యీ సుకుమారికరంబు ద్రెంచ జూచెదవా?

ఉ. అన్నవు నీవు చెల్లెలికి నక్కట మాడలు చీరలిచ్చుటో!
మన్నన సేయుటో, మధురమంజులభాషల నాదరించుటో
మిన్నుల మోసితే నిజము మేలని చంపకుమన్న, మానిరా
వన్న, సహింపుమన్న, విగదన్న, వధింపకుమన్న వేడెదన్.

కంసు—ఛీ! వేమాటలేల? తన్ను బాధించు పగవాఁడు జనించు చుండ నేను దానికి యోర్చుకొని వానిఁగడతేర్చు సాహసోద్యమముఁ జేయక యూరకుండుదునటి వా? కావున నవశ్య మీమెను వధించెదను. నీవేమి చెప్పెదవు?

వసుదేవ—(కంసుని చేతులు పట్టుకొని) కంసరాజేంద్రా! నామాట లాలించి పిదప నీయిష్టమువచ్చినట్లు చేయుము. మేమిటువుర ము నీచేతిలోని వారము గదా? మృత్యువనునది వచ్చు వేళ యెవ్వరడ్డపడినను రాకమానదు రానివేళ యెందఱెంతటు దాని నిం బోత్సాహ పఱచినను రాఁజాలదు. ఇట్టిదానికై స్త్రీహత్యాపాతకమునకు నిచ్చఁబోలునివేకశిఖామణు లొడిగట్టుదురే? అంతను యెందో యూరుపేరులేని సామాన్యకామినిని జంపుటయా? ఏకోదరమున రక్తము నర్ధముగఁ బంచుకొని నీ మేనితోడఁబుట్టిన సహోదరినిఁ జంపుటయే? అయ్యో! యిట్టి వెఱ్ఱిమాటల విశ్వసించెదవే! యెవరోయొకరు ప్రమాణ పద్ధతిలేక, కారణముఁ జెప్పక, వ్యర్థప్రలాపంబు లాడినమాత్ర మననే యామాటలు వేదవాక్యములనుకొని "నాకొక శత్రువు జనించు"నని భవాదృశధీరశిఖామణి పరితపింపఁబోలునే? అట్టిశత్రువు జనించుననియే నమ్మెను. అట్టివానితో సమసంగ్రామమున హరిహరాదులకైన గెలువనలవి కాని శూరశిఖామణివి దునుమాడి

జగన్నుతమైన సత్కీర్తిని వడయుటగదా ధీరశిఖామణుల కిన
లేని భూషణము? ఆ చెప్పినవారిమాటలు తథ్యములని దేనిఁబట్టి
నమ్మవలయు? అట్టిసందేహాపుదుర్భాషలచు చెవినిడి కన్ను
లార్ప మన్నింపుమనివేడెడి నీచిన్ని చెలియలిని కన్నారు వధింప
నెంచుట నీకు పిదప పశ్చాత్తాపముఁ గలుగఁజేయుదా? కా
వున నీకార్యము మానుము. వివేకము తెచ్చుకొనుము. కోప
ముచేఁ జేసినకార్య మెట్టివానినైనను వగనొందింపక మానదు.

మ. చెలియల్, కన్నియ, ముద్దరాలు, అబలా నీమం బెదింతింతు ని
ర్మల, దీనిఁ బయలాడు మాటలకునై మర్యాదపోనొట్టి, స
త్కులజాతుండవు, పుణ్యమూర్తి వకటా! కోపంబు పాపంబు నె
చ్చెలి నోహో తెగ వ్రేయ పాడియగునే చింతించు భోజేశ్వరా?

కంస—వసుదేవా! నాకా నీతినేర్పెదవు? నీయట్టివారికి పదివేవురకు నీతి నేర్పెదను. బయలాడువాక్యములని యెంచకుము. చెప్పనేవలయునన్నఁ జెప్పెదను. ఆ నారదమహామునీంద్రుఁడే యీయుదంతము నాకు దెలిపెను ఇది విశ్వసనీయమో యవిశ్వసనీయమో నీవే తెలిసికొనుము. ఎక్కడిచెల్లెలు? కార్యసాధకులగువారికి బంధు వావి వరుసలు, మానావమానములు నెంచఁదగునే? ఇట్టియొకయాఁడుదానికై చింతించిన నాప్రాభవజీవితఫలవృక్షము మంటఁగలసి నశింపదా? పొమ్మూరక.

వసుదేవ—ఆహా! నీయట్టినీతి నీయట్టివారికే తెలియును. తల్లి, తండ్రి, చెల్లెలు, అన్న, తమ్ములని భేదములేక చరించు మహానీయునకు నేనేమి చెప్పగలను? ఇప్పుడు శత్రుబాధకు తాళలేనివాఁడవు రేపు దండధరునిబాధ కెట్లు తాళుదువు? కటికఱాయియైన నీఘోరకృత్యమునుఁజూచి మార్దవము వహించును గాని నీమానసము మార్దవము వహింపదయ్యె. ఈ ధర

ణీ రాజ్యము శాశ్వతమని నమ్మికొని, ఘోరరౌరవనరక బాధాయకమని యెంచక, పరమహేయహింసాకార్యమని గణింపక, దీనిఁగాంచిన నీతలిదండ్రుల మనస్సంతాపదవానలంబు నించుకమైన శంకింపక, చెలువారు నిండుప్రేమంపు చుట్టములలో నెక్కుడగు గారాబుతో బుట్టువేయని యొక్కింత సంశయింపక, మహాపాతకావాచ్యనిందాకృత్యమని గణింపక, సకలజనభూషణాయమానంబగు కరుణారసంబును మదినింతయేనిఁ గొనక, దురాశాపిశాచావేశితుఁడవై కన్ను మిన్నుఁగానక, యస్మదీయనీతివాక్యంబులఁ బాటింపక, కట్టా! యంతకంతకు దుర్మదక్రోధావిష్టుఁడవై, "పాహి" యని పాదంబులపైఁబడిన పరమసాధ్వీమతల్లియగు నీ ఇల్లాలినిఁ జంపనెంచితివే? నీరాజ్యమును, నీప్రభుత్వమును, నీసంపదయు, నీదేహప్రాణంబులును స్థిరంబులని నమ్మితివా? ఇది నీ వెంటవచ్చునా? మాంధాత హరిశ్చంద్రాదు లెందరీభూమి నేలిరి. వారొక్కరైన నీభూమిని వెంటఁగట్టుకొని పోవలేదు గాని నీవుమాత్రమీ సకలభూమండలము నెచ్చటనుఁ గదలాడకుండ నీవెంటఁ బెట్టుకొనిపోయెదవు గాఁబోలు!

సీ. నిరతసత్యప్రౌఢి ధరణి నేలిన హరి
శ్చంద్రుఁ డీధరఁ బాసి చనఁగలేదె
ఎల్ల లోకము లేలి యెసఁగు శ్రీనలరాజు
తన వెంట భూమినిఁ గొనుచు చనెనె
కృతయుగంబున నలంకృతిఁ జేయు మాంధాత
శిరిమూటగట్టుక నరుగఁగనెనె
జలధి సేతువుఁగట్టి యలరారు శ్రీరాముఁ
డుర్విపై నిప్పుడు నున్నవాఁడె

గీ. ఎందఱెందఱో రాజులు నేగినారు
ఒక్కరును వెంటఁగొనిపోవ రుర్వితలము
నీవు మాత్రము రాజ్యంబు నీదు శిరియు
తలను కట్టుక పోదువో ధర్మహృదయ!

ఎవ్వరుతేరని నిర్జనారణ్య ప్రదేశమునుండి నీ వెంట నమ్మి వచ్చిన చుట్టంబుల నట్టేటఁద్రోసెదవే? నీవు బలిష్ఠుఁడవైనఁ గానిమ్ము, నీకు నే వెఱవను. ధర్మపద్ధతిని నీతిమార్గమును చెప్పకమానను. ఇంతకుమీఱివచ్చిన మాయిరువురిప్రాణంబులఁ గదా నీవుకొనెదవు ? అవి తృణప్రాయములు. నేఁడుగాకున్న మఱునాఁడైన చనఁగలవు. ఇంకేమిచేసెదవు? నామాట లిప్పుడేల గ్రహించెదవు? పరలోకంబున యమయాతనలఁబడి ప్రాణంబులుపోక పరితపించి పరితపించి తనకులాఘనప్పుడైన యెఱుఁగఁగలవు ఈపాపకార్యము నివొక్కఁడవాచరించినను, యెవ్వరెఱుఁగకుందురని యోచింపకుము. సత్యమార్గమవలంబించిన సూర్యుఁడును, సకలదిక్కులును ధర్మదేవతలైన నెఱుఁగరా? కానిమ్ము. మమ్మిరువురను వధింపుము.

సీ. నమ్మివచ్చినవారి నట్టడివిసఁ జంప
తెలియ వెవ్వరికంచుఁ దలపకయ్య
కలుషకార్యముకోడి, చలియించి తపియించి
దీపించుఖడ్గంబు తెలియ లేదె
నీచేత కార్యముల్ నిత్యంబుచేయించు
తొలిజన్మకర్మంబు తెలియ లేదె
జగముల రక్షించి సర్వంబు భరియింపఁ
గల ధర్మదేవత తెలియ లేదె

తే. గీ. పరగ నీయాత్మ, నాయాత్మ, పావనాత్మ
నిత్యజీవాత్మ, సగుణాత్మ, నిర్గుణాత్మ
అఖిలదేవాత్మ, సత్యాత్మ, అంతరాత్మ
నిరతకాలాత్మ, పరమాత్మ, యెఱుఁగలేడె.

కంస—ఈగుడ్డిబెదరింపులకు నే బెదరెదననితలఁచితివా? చాటలు కొట్టి పిల్లులబెదరించుట యెన్నడు నేర్చుకొంటివి? యముఁడఁట! నరకమఁట! వాఁడెవఁడు? క్రొత్తయముఁడా? పాతయముఁడా? మత్క్రోధవీక్షణములఁ బరితపించుచు నేఁ జెప్పినట్లు మదీయశాసనమున వర్తించుయమునినా నాముందర కొనియాడెదవు? ఆ యమునకు యముఁడను నేను కానా? ఇఁక పేలిన మీప్రాణములు దక్కవు. నా శత్రువును నేలఁబెట్టి కాలరాచుట నాకెంతయుఁ గర్తవ్యము. దానికై యెట్టిసాహసమైనఁ జేసెదను. ఊరక నిష్ప్రయోజనముగ స్త్రీని వధించెద ననుకొంటివా? యోచించి యోచించి యెందును దాటఁగానక నాకొక దుర్నివారుఁడగు శాత్రవుఁ డుదయించుట కెంతయు సహింపఁజాలక యిట్టిసహోదరీమారణకృత్యమునకు సాహసించితిఁగాక యిట్టి వివేకము తెలియక కాదు. ఏమో బంధువని నీ నీచసల్లాపముల వినగల్గితిఁగాక నాయుశక్తియని యెంచకుము.

వసుదేవ—(స్వ.) ఏమో మార్గమునకు వచ్చుచున్నట్లున్నది. చూచెదగాక. (ప్ర.) కంసరాజేంద్రా! ఇదొక్కటియే నీకును నాకునుఁ బ్రథమపరీక్షణము. నీకు శాత్రవబాధ లేకుండునట్లును సహోదరీమారణపాపము రాకుండునట్లును నే నొక్క చిన్నియుపాయముఁ జెప్పెద. అప్పుడైనను నీవు చేయునది ధర్మమో యధర్మమో బయలుపడగలదు.

కంస—చెప్పుము. తొలుతఁజెప్పుము. మదీయఖడ్గధార దుర్వార వైరివక్షఃకంఠసీమయందు దనువంబడి విజయలక్ష్మిని చేకొనుటకై యెదురుచూచుచున్నది గాని చేతగానియొక్కయబలను చక్కాడి లోకమున సాటిలేని యపకీర్తి నొందుటకై వేచియున్న దనుకొనకుము. ఏది యాయుపాయము ? వచింపుము. నిర్భీతిగ వచింపుము.

వసుదేవ—ఇట్లడుగుము. యుక్తియున్న గైకొనుము. మౌర్ఖ్యము మాత్రము వదలుము. నీచెలియలి యష్టమగర్భముగదా నిన్ను సంహరించునని నారదుఁడు చెప్పెనని చెప్పితివి?

కంస—అష్టమగర్భమనియే చెప్పినట్లున్నది; (ఆలోచన నభినయించి) కాని యది దృఢమని నమ్మఁజాలను. కావున నే గర్భమైనను సరియే.

వసుదే—కానిమ్ము. అయిన నీమెకు జనించు ప్రతిశిశువును జనించినవెంటనే నీకప్పగించెదము. నీవేమైనఁ జేసికొనుము. ఇంతకై నీచెలియలిని వధించునంత యావశ్యకతయేమి?

కంస—సరియే! (కొంచెమాలోచించి) నీయుపాయము బాగుగనే యున్నది. అయిన మీరాశిశువులఁ దప్పక నిత్తురనుట కేమిత్తరవు? కావున నిది యెన్నఁటికిని సరిపడదు.

వసుదేవ—అంతయేల? అంతవఱకు మేమిఊపురము నీభవనముననే యుండెదము.

కంస—కల్ల. గ్రహచారసమయమున నెవ్వరి కెట్టిబుద్ధికలుగునో యెవ్వరెఱుఁగుదురు?

మ. తనయుఁడు కీడునెంచు, తనధర్మపుపత్నియె యేవగించు, తా
జనకుఁడె మోసగించు, సహజాతుఁడు దుండగమెంచు తన్నుగాం

చినజనయిత్రి శత్రువగు చిక్కులబెట్టుచు, విరోధకాలమున్
తనరిన వేళ బంధువులతాల్మిని నమ్మఁగరాదు ధారుణిన్.

కార్యమువట్ల నేను యెడమచేతిని కుడిచేతిని నమ్మువాఁడనుగాను. అందును మీరా ముదుసలియగు నుగ్రసేనునితో మొఱబెట్టుకొంటిరా నా కార్యమంతయు విఫలమగును. కావున నెనమండ్రుపుత్రులను ప్రసవించువఱకు మాత్రము మిమ్ము కారాగృహమున నుంచెద. పిదప విడిచెద.

వసుదేవ—కంసరాజేంద్రా! ఇది న్యాయమా?

కంస—ప్రేలకుమింక. వచించినది వచించియే యున్నాఁడను. మిన్ను విఱిగి పైబడినను వెనుదీయను. సేవకులారా!

[ప్రవేశము—సేవకులు.]

వీరిద్దరిని మథురాపట్టణమునకుఁ గొనిపోయి కారాగృహమునం దునుపుడు. వీరిరక్షణమున మిక్కిలి జాగరూకులై యుండుడు. తప్పితిరా మీ మొండెలు మీవి కావు. కొని పొండు వీరిని.

(నిష్క్రమింతురు.)



శ్రీ

# కృష్ణలీల నాటకము.

## ద్వితీయాంకము—ప్రథమరంగము.

---

### కారాగృహము.

[శృంఖలాబద్ధులై దేవకీ వసుదేవులుందురు.]

(అనుబంధము 15)

దేవకి—దైవమా! నాయట్టినిర్భాగ్యురా లెవరైన జగతినుండునే? ఎవరైన కష్టముల ననుభవింపవలసివచ్చినఁ దమపగవారినుండిగదా యనుభవింతురు? నా కట్టుగాక నాకూర్మియగ్రజునుండియే వినరాని కనరాని కష్టములుగల్గెగా? పురాకృతపాపఫల మెంతగలదో కన్న కసిగందువులఁ గనులారజూచుటకైనం బ్రాప్తిలేదయ్యెగా? అకటా! కంసునిఁ బోలిన కఠినాత్ముఁ డెవడైన నుండునే? ఏమియు నపరాధ మెఱుఁగని నెత్తురుగందుల కన్నుల తెరిచి తెరవని చిన్నిపాపల నించుకైనఁ గనికరంబులేక వధించి యేఫలము ననుభవించెను? నాథా! నాఁడేల నీ వాకంసుని వేడికొంటివి? ఆనాఁడే వానినిశిత ఖడ్గధారచే నేవధింపఁబడియుండిన నిట్టి పుత్త్రశోకము గన్నులారఁ దిలకించుకష్టము నాకు లేకుండుగదా? ఒక్కరుకాదు. ఆరుగురిని. చిలుక పిల్లల బ్రాపురుగాని కప్పగించి నట్లయ్యెనే? ఈపాపాత్మురాలి కిన్నికష్టములు చాలవని, మొన్న యేడవగర్భముసైతము గర్భస్రావరూపమునఁ బోయెనుగదా? ఇపుడు మాత్రము సంపూర్ణగర్భవతినై

యుండి యేసుఖము లనుభవింప నున్నదానను? కన్నసుతుల
ముద్దాడి, వారి ముచ్చట లాలించి, మనసార ముద్దిడుభాగ్య
ము లేదయ్యెగా? ఇఁక నే మనఁజాల. గర్భవతినై యీఘోర
కష్టముల చూడఁజాల. ఈజనించుశిశువును కంసుని కరవా
లధార కప్పగింపఁజాల.

వసుదేవ—ప్రేయసీ! ఏమి చింతిల్లి యేమి ప్రయోజనము? తొలి
జన్మంబుల నెన్ని శిశుహత్యలఁ జేసియుంటిమో యాపాప
ఫలము నిప్పు డనుభవించుచున్నారము. అయినను నా దేవ
దేవుఁ డా శ్రీహరి మా మొఱాలించి మనకష్టముల కంత్యము
చేయఁగలఁడు. ఊరడిల్లుము.

[ప్రవేశము:—నలుదిక్కులనుండి, యీశ్వరుఁడు, బ్రహ్మ
ఇంద్రుఁడు, నారదుఁడు మొదలగువారు]

ఈశ్వర—దేవా! శ్రీరమణా! దేవకీదేవిగర్భమునుండి వెలువడుము.
నీకై, నీ రాకకై మొగములు వాచుచున్న మమ్ము గాపాడుము.
జనార్దనా! బ్రహ్మచే లోకముల సృజింపఁ జేసి యేకంటకంబు
లుఁ రాకుండ నన్నిజగముల రక్షించు దయామయుఁడవుగదా
నీవు? నిర్గుణుఁడవై, నిరంజనుఁడవై, నిస్సహాయుఁడవై యెల్ల
వేళల నెల్లదిశల నెల్లలోకములఁ గుక్షియందిడుకొని మత్స్య
కూర్మాదియవతారములొంది పరిపాలించువాఁడవుగదానీవు?

మ. గురుపాఠీనమవై, జలగ్రహమవై, క్రోడంబవై, శ్రీనృకే
సరివై, భిక్షుకుఁడై, హయాననుఁడవై, బ్రహ్మదేవతాభర్తవై
ధరణిన్ రాముఁడవై దయాగుణగణోదారుఁడవై లోకముల్
పరిరక్షించిన నీకు మ్రొక్కెద మిఁకా భారంబు వారింపవే.

బ్రహ్మ—కమలానాథా! నిన్నుఁ గొల్చినవారికి జననమరణాములు
లేకుండఁజేయు నీకు బుట్టుక యొకటిగలదా? లోకవిడంబ

నార్థమై జనన క్రీడావిలాసంబుల నటించెదవుగాక! దుష్టజన దవానలంబున దహింపఁబడుచున్న లోకముల భవత్కరుణా పాంగ వీక్షణ సుధారసమున చల్ల జేయుము.

క. మృచ్చిలియున్నది లోకము
నిచ్చలు కంసాదిఖలులు నిర్దయులేపఁ
మచ్చిక కావఁగవలయును
విచ్చేయుము తల్లి కడుపు వెడలి ముకుందా.

ఇంద్ర—దేవా! ఇన్నిదినములు హిరణ్యకశిపునిబారినుండి మమ్ము రక్షించితివి. బలిచక్రవర్తి విక్రమ మణచి నాకు స్వర్గరాజ్య మిచ్చిగాపాడితివి రావణకుంభకర్ణాదులచే వచింపరాని యవస్థకు లోనైయున్న సర్వలోకముల దయామతివై పాలించి తివి ఇపుడు కంసాదిదానవు లిడు నిడుమలపాలైయున్న మమ్ము నీవుఁబ్రోవకున్న మరియెవరుబ్రోచువారు! పరమపు రుషా! ముకుందా! దేవకిగర్భమునుండి దయచేయుము.

సీ. రాగదే యోదేవ రాజీవనళనేత్ర
రాగదే విబులేన్ద్రా విహార
దయచేయవే దైత్య చయనాశ జగదీశ
వైకుంఠపురవాస మందహాస
అవతరించవె దివ్యనవనీరదశ్యామ
కౌస్తుభమణిధామ కాంతనామ
విచ్చేయు గోవింద వినుతతాపసబృంద
భక్తార్థయానంద వరముకుంద

గీ. మాధవా! లోకమంతయు బాధజెందె
కరుణగావవె బ్రోవవే కనులగనవె

ఎంచి యాదుష్టకంసు వధించి మించి
సంచరింపఁగరాగదే సదయహృదయ.

నారద—గోవిందా! సమస్త సురులు యాదవులై జనించియున్నవారు. భూభారము దినదినమునకుఁ గడుహెచ్చుచున్నది. నీరాకకై యెదురుచూచు భూసతీరత్నమును మఱ్ఱవచే నారయుట కిదియే తరి. విచ్చేయుము. తల్లీ! దేవకీదేవి! నీభాగ్యవిశేష మెంతశ్లాఘనీయము? కరయోగులకైనను, జ్ఞానులకైనను, జపతపాదులఁజేయు కర్మయోగులకైననుఁ బొందరాని శ్రీహరి సాక్షాత్కారపుణ్యము గంటివి. అమ్మో! ఆ శ్రీధరుఁడు నీగర్భవాసమున నున్నవాఁడు. ఉదయించి నీకుఱుముల బాపు వాఁడు. చింతిల్లకుము. ఊరడిల్లుము.

మ. తల్లి నీయుదరంబులోన ద్రిధామపూరుషుఁ డున్నవాఁ
డల్లిపుట్టుడు కంసుచే భయమింత లేదు నిజంబు మా
కెల్లవారికి భద్రమయ్యెడు నింక నీకడు పెప్పుడున్
చల్లగావలె యాదవావళి సంతసంబును పొందగన్.

(అందఱు నిష్క్రమింతురు.)

(ఒక శబ్దము పుట్టును. అనేకవిద్యుత్ప్రకాశములతో గొప్ప వెలుతురు గలుగును. దానియందొక వ్యక్తి శ్రీవిష్ణుమూర్తిగా నుద్భవించును. దేవకీవసుదేవులు దిగ్భ్రమనొంది చూచి, సంతసించి, సాష్టాంగదండప్రణామంబులఁ జేయుదురు.)

వసుదేవ—దేవాధిదేవా! సుప్రభావా! గోవింద! ముకుందా? నీలమేఘశ్యామా! నీదయావలోకనమున మా తాపత్రయముల బాపుము. నేను సంసారసుఖముల నపేక్షింపను. ఐశ్వర్యములఁ గాంక్షింపను. రాజ్యము నాశింపను. నిత్యమై, నిరుపమాన

మై, నిర్దుఃఖమై వెలరారు మోక్షసుఖమొసఁగి కాపాడుము. కాపాడుము.

దేవకీ—లక్ష్మీవల్లభా! లోకవల్లభా! దీనశరణ్యా! కంసునిచే బాధితులమై గత్యంతరము గానక నజస్రము నిన్నే ధ్యానించుచున్న మాపై దయరావించి, చల్లఁగ పాలించి, కృపాకటాక్షము నించిగద మాకు సాక్షాత్కరించితివి? పుండరీకాక్షా! భవదీయ సచ్చిదానందస్వరూపమును గన్నులార తిలకించెదమన్న మా యిరువురి నేత్రములకు సాధ్యముగాకయున్నది. శ్రీవరదా! జ్ఞాననేత్రములనొసఁగి తనివిదీర నీమూర్తినిఁ గాంచు పరమభాగ్యము దయచేయుము. దేవా! స్త్రీచాపల్యమునకోరినకోరానిదియైనను నాకోర్కె ఫలింపఁజేయుము. వాచామగోచరముగ, కౌస్తుభభూషితముగ, లక్ష్మీసన్నిధానముగు, నీదివ్య ప్రభాదేహమును నొక్కపరి గాంచి మాజన్మ సాఫల్య మొందెదము. నారాయణా! భవద్దర్శనభాగ్యమబ్బుటచే నీచెఱసాలయే వైకుంఠధామముగును. ఈధూళీధూసరితప్రదేశమే మణిమయసౌధముగును. త్రివిక్రమా! పురుషోత్తమా! అనాథులమై యున్నవారము. నీవుతప్ప శరణాంతరముఁ గాంచనివారము. బ్రోవుమా. కరుణింపుమా.

విష్ణు—దేవకీవసుదేవులారా! ఇదె మీకు జ్ఞాననేత్రములనొసంగితి. ఒక్కపరిఁ దిలకింపుఁడు.

వసుదేవ—పరమాత్మా! నీకరుణారసమేమని కొనియాడుదుము? నీదివ్య తేజోమయాంగమునుఁ గాంచితిమి. ధన్యత నొందితిమి. సారసలోచనా! భవదీయమూర్తినిఁ గాంచిన యీనేత్రములు మఱల బ్రపంచమునుఁ జూడకుండఁ జేయుమా.

విష్ణు—పావనులారా! మీరు తొలిజన్మమున నన్నెంతయో యారాధించితిరి. మీ యిరువురిలో నీవు పృశ్నియను నొక కామిని. నీవు సుతపుండను మహానీయుఁడవు. మీరు ఘోరకాంతారమున నన్నుఁగూర్చి యద్భుతరీతిఁ దప మొనర్చితిరి. మీభక్తికి మెచ్చి నేను మీకు సాక్షాత్కరించితిని. అపుడు మీరు దివ్యమోక్షపదవినిఁ గోరక నాయట్టికుమారుఁడు కావలయు నని వేడితిరి. మూఁడుజన్మములయందు మీకుఁ గుమారుడనై నేనే జనించునటుల మీకు వరం బొసంగితి. మొదటిజన్మమున పృశ్నిగర్భుఁ డను పుత్రుఁడనై మీకు జనించితి. రెండవ జన్మాంతరమున అదితికశ్యపులుగా జనించిన మీకు నేను వామనావతార మొంది పుత్రసుఖ మొసంగితిని. ఇపుడు మూఁడవజన్మమున దేవకీవసుదేవులుగా నుద్భవించిన మీకు నేను శ్రీకృష్ణుఁ డను కుమారుఁడనై జనించితి. మీ రేమియు నాలోచింపకుఁడు.

చ. పొగలకుమమ్మ నీకు వరపుత్రుఁడనై జనియింతునమ్మ నీ
పగతునిఁగంసు ద్రుంచి మిము బంధవిముక్తులఁ జేతునమ్మ మీ
కగణితసంపదల్ గలుగునమ్మ మహోన్నతమోక్షసౌఖ్య మొం
దఁగనగునమ్మ నిత్యప్రమదంబున వెల్గుదువమ్మ దేవకీ.

వసుదేవ—దేవా! కంసుఁడు మాకు జనించుకుమారులందఱిని క్రమముగా వధించెను. నిన్నుఁ గాపాడువిధాన మెట్లో తెలియకున్నది.

విష్ణు—మీ రేమియుఁ జింతింపకుఁడు. ఇదివఱకే యీ మెగర్భమున వృద్ధిగాంచుచున్న నాయంశమగు నాదిశేషుని తేజమును రేపల్లెయందు రోహిణీ యనెడు యాదవాంగనగర్భమున నుంచి జనింపఁ జేసి యున్నవాఁడ. ఆ యేడవగర్భమే యీ మెకు

గర్భస్రావమైనదని మీరనుకొనుచున్నది. నా యోగమాయ యా రేపల్లెయందు యశోదాదేవిగర్భమున జనించియున్నది. నీవు నన్నిపుడే రేపల్లెకుఁ గొనిపోయి యాయశోద ప్రక్కన పరుండబెట్టి యామె స్త్రీశిశువు నిచ్చటికిఁ గొనితెమ్ము దానిని కంసుఁ డేమియుఁ జేయఁజాలఁడు.

వసుదేవ—దేవా! ఇది యెట్లుసాధ్యమగును? పాదము కదల్ప నేరకుండ సంకెలలు వేయబడియున్నవి. ఈయర్ధరాత్రిమున నేబోవునపుడు కంసునిభటు లెవరైన నన్నుఁగాంచినఁ దప్పక మోసము వాటిల్లును. ఇదియుఁగాక యపారమగు యమునానది నెట్లు దాటుకొనును? ఎఱుకలేనితనమున నే నింతప్రశ్నించినందు కైనను క్షమింపుము.

విష్ణు—నీ వేమియు భయపడవలదు నీ కీసంకెల లుండనేరవు. ఎవ్వరు నిన్నుఁ దిలకించినను నీ కేయపాయము రాకుండ నేఁ గాపాడెదను. యమునానది నీకుఁ దారి యివ్వఁగలదు. వేయేల? నీ కేయంతరాయమునుఁ గలుగదు. ఇదే నే నిప్పుడే లోకసామాన్యమగు బాలుని రూపమును గైకొనియెద. (వసుదేవుని సంకెలలూడిపోవును. సేవకులు మూర్ఛనొందెదరు. విష్ణురూప మదృశ్యమైపోవును. ఒక చిన్నిబాలుఁ డుదయించగా దేవకి వానినెత్తుకొని ముద్దాడును.)

వసుదేవ—(కడుసంతోషముతో) సతీరత్నమా! తెమ్ము. మనభాగ్యఫలమును తెమ్ము. మనమోక్షఫలమును తెమ్ము. మనదేవదేవుని తెమ్ము. ఒకతూరి గన్నులారతిలకించి వాకిమ్ము.

దేవకి—(బాలకుని నెత్తుకొని) ఆహా! ఈబాలుఁడు, సచ్చిదానందమూర్తియుఁడు, భాసురకపోలుఁడు నాచేతఁ దమచ్చటతాఁడ భాగ్యము నో కన్నతిగా? లోకకగద యిట్టై కంసుఁడు, కలపాఁసనుఁడు

నాకన్నబిడ్డల నన్యాయముగ నాకు లేకుండఁ జేసెనే? రమా రమణా! నా కీలనంతానఫల మిచ్చితివి? అట్టి గొడ్రాలనై యున్న నా కీదుఃఖ ముండియుండదుగదా? ఆ చింతవంతయు మఱచి యీ కుమారరత్నమును దిలకించి ధన్యతఁ గాంచ నెంచితినిగా? అట్టిభాగ్యము నాకుఁ గనిపించికనిపింపకపోయెగా? ఓ కుమారా! రూపజితమారా! నీవు వటపత్రమున శయనించి సమస్తలోకముల నీనేత్రవిలోచనమునఁ గల్గింపఁజేయలేవా? అదితిదేవి యంకపాళిపై శయనించి కరంబు నలంకరించి, ముద్దులనించి, మురిపెము వహించి, వామనుఁడను పేరుచే నామె కెంతయు నందరాని మోక్షపదవి నొసంగ లేదా? కౌసల్యా ముద్దులబాలుఁడవై, జానకీమనఃకాముఁడవై తలిదండ్రులఁ గృతార్థులఁ జేయలేదా? ఇపుడు నే నొనర్చిన యపరాధమేమి? ఇంతలో నను బాసెదవే? నిన్నుఁ గన్నులార నింకను చూడనైనను లేదుగదా? నీ ముద్దుమాటల నా కెపుడు వినిపించెదవు? నీ యాటపాటల నెప్పు డాలింపఁ జేసెదవు? నా యంకపాళిపై శయనించి "అమ్మా" యని యెప్పుడు ముద్దులొలుక బిలిచెదవు? అన్నా! పోయి వచ్చెదవా? మరల నీజననినిఁ గాంచెదవా? లేక యీజన్మముల నింతయే ప్రాప్తియా?

సీ॥ వటపత్రశాయివై బహులోకముల నెల్ల
కనుల విప్పినయంత కనగ లేదె?
అదితియంకముఁ జేరి యల వామనుండవై
చెలువార ముద్దుల చిలుక లేదె?
ముదమార కౌసల్యముద్దులరాముఁడై
యసమభాగ్యము నామె కొసఁగ లేదె?

చూచిచూచకయున్న నాచిరుపాప నట్
బ్బాయుట నాపాపఫలముగాదె?

గీ॥ రాజసమపాల భక్తసంత్రాణశీల
జగదవనలోల సత్కృపాసారజాల
అభ్రసమనీల సుకుమార తాలవాల
బాలగోపాల సుకపోల భాగ్యశాల.

వసుదేవ—దేవీ! శోకించిన నేమిప్రయోజనము? ఎంతశోకించినను మనప్రాప్తి యింతయే. ఏయుపాయము రాకుండ నీకుమారుఁడు రేపల్లెయందు రక్షింపఁబడుచుండ నాక్షేమవార్త వినినయెడను సంతసింపవచ్చునుగదా? ఇందీకంసునిబారి కప్పగించి మనకన్నులెదుట—అకటా! తలచుకొన్న నెట్టిరాగుండెయయిన నీరగుగదా—అట్టి తలవరాసిశత్రుప్రసక్తిన గోరరాని ఘోరకార్యముఁ జూచుటకన్న మేలుగదా? తరుణీ! మనకీయెనలేని యెవ్వరికిలేని, సుకుమారుఁడు, మారుఁడు, మారజనకుఁడు కుమారుఁడుగానున్నను సమీపించివచ్చు భాగ్యముసహిత మనుభవించు నదృష్టము కలుగదయ్యె. కట్టా! మనుబోలిన హతభాగ్యులుందురే? తొలిజన్మమందలి ఫలముననుచింతించిన యేమిప్రయోజనము? లెమ్ము ధైర్యము పూనుము. బాలకునిమ్ము. అదే యర్ధరాత్రము మీరుచువచ్చె.

(అనుబంధము 17.)

దేవకి—అయ్యో! చేతికివచ్చినఫలము ననుభవింప నేరకున్నదాననే! ఆజన్మము దుఃఖములకు నిలయమగు నాయట్టి నిర్భాగ్యురాలికట్టిభాగ్యమేల లభించును? పాపఁడా! నాచిన్నితండ్రా! నాయట్టి పాపాత్మురాలిగర్భమున నేలజనించితివి? అకటా! గర్భమునకలిగిన కన్నకుమారు నొకక్షణమాత్రము రక్షింపఁ

జాలనితల్లి నెందైనవింటిమే? ఎంతదరిద్రులైననుఁ దమపుత్రు
లనెందైనం బారవేయుఁజూతురా? బాలకా! పోయిరమ్ము.
మరల నినుఁజూచుట సంభవించునో సంభవించదో కాని యిదే
తుదిమాట వచించెదరు. ఎప్పుడైనను నీతల్లిఁ స్మరింపుము.
నాముద్దులయ్యా! నీకు మార్గమున శుభమయ్యెడు. అలనాఁ
డయోధ్యాపురిలో పితృవాక్యపరిపాలన మొనర్చుటకై యడ
వికేఁగు శ్రీరామచంద్రున కేయాశిషములు నాకౌసల్యామహా
దేవి యొసంగెనో యాయాశిషములు నీకుఁగలుగుఁగాక. ఆమృ
కండుమహాముని తనసందనుఁడగు మార్కండేయుని చిరంజీవి
త్వముఁగోరి తపమొనరింపఁబంపునప్పు డేవరముల నిచ్చిపంపి
యుండెనో యాశుభములు నీకు గలుగుఁగాక (ముద్దుపెట్టుకొని
యిచ్చును.)

వసుదేవ — (శిశువును తీసికొని) అన్నా! రమ్ము. నీకు జాతకర్మనామ
కరణాదులనైనను చేయుటకున్న శక్తిలేని యీతండ్రి నేమి
యుఁగనలేదుము. కనులు తెరవని చిన్నిపాపని నెందో పార
వైచెదు నిష్కారుణ్యుఁడని దూరకుము. విధిలేక కంసునికి వెఱచి
నిన్ను దూరమున విడిచివచ్చెదగాని వేరనిఁదలఁపకుము. పెరి
గి, పెద్దవాఁడవై కడిదిఱేఁడవై మరల నాయొద్దఁ జేరుము.

సీ. పుత్రరత్నము! నిన్నుఁ బుట్టినంతనె యెందొ
పారవైచితినంచు దూరకన్న
కన్నబిడ్డల నిటు కాపాడి బ్రోవలే
నట్టితండ్రికి నేల పుట్టితన్న
సొంపార నీముద్దు సుద్దుల నాలించు
నట్టిభాగ్యము నోచనైతినన్న

అన్నరో! సురల నిన్నెన్నఁడు జూతుమో
కనులార నిప్పుడే గాంతుమన్న
గీ. యిపుడు నొకసారి నీముద్దు నీయవన్న
తల్లిదండ్రుల నెప్పుడైనఁ దలపుమన్న
ఎందు శ్రీహరి నిన్ను రక్షించునన్న
పోయిరావన్న శుభములఁ బొందుమన్న.

(ముద్దిడికొని) దేవతాసార్వభౌములారా! వనదేవతులారా! పుర కాంతారములారా! రేపల్లెయందలి ధేనువులారా! యీపసి బాలునిఁ బాలింపుఁడు.

సీ. కలువలచెలికాని కనువాని నీబాలు
నేలరే ఘనలోకపాలకులార!
కలుములదేవిసంగడికాని సుకుమారు
నరయరే సారదయాళులార!
తొలిపల్కులనుమించు తొలిపాప గ పాప
బ్రోవరే కరుణతభావ్యులార!
వెలలేనివలపుల వలరేని గన్న యీ
చిరుతను కావరే సిద్ధులార!
గీ. సరసవనములార! గిరులార! తరువులార!
మానివరులార! హరులార! మాన్యులార!
సతతగతులార! శృతులార! వ్రతతులార!
మాదుగోబాలు ఘనలీల మనుపుఁడయ్య!

(నిష్క్రమణము.)

ద్వితీయాంకము—ద్వితీయరంగము.

మధురాపట్టణము-రాజాస్థానము.

[కంసుఁడు, వకృనాసుఁడు, అఘాసురుఁడుఁ ధేనుకాసురుఁ డను మంత్రులు మొదలగువారు నుందురు.]

కంస—మంత్రులారా! సచివచంద్రులారా! భూమండలంబంతయు మదీయశాసనమునకు లోనయ్యె. ఇఁక మనము దేవలోకము నిర్జించుటకై తగుసన్నాహంబుల నలుపవలయు. నామిత్రులగు జరాసంధ, శిశుపాల, దంతవక్త్రాదులకు నుదంత మిప్పుడే చెప్పిపంపవలయును వారందఱు నెప్పు డీభూలోకము నువ్వెత్తుగ మిగిలెదమని యోహాటించుచుందురు. అస్మదీయాంగీకారమునకయ్యె యింతకాల మూరకున్నవారు. కావున మన మందఱముఁ జక్కగ పర్యాలోచించి దండయాత్రకు సేనలసిద్ధపరుపవలయు. మీ రిపుడే జరాసంధాదులకు నొకపత్రిక వ్రాయుఁడు. ఇదియుఁగాక మొన్న కళింగదేశమునకుఁ బంపఁబడిన సేనాను లాదేశమును జయించినవార్తఁబంపియున్నారా?

వకృనాస—దేవా! ఆసేనాపతులింకను రాలేదు. వారు జయమే యొందిరనుట కొకసందియము కలదే? ఏలినవారిసేనాపతుల కపజయము గలుగుట జగము తల్లక్రిందగుటయే గదా?

అఘాసుర—ప్రభువతంసమా! ఒక్క వృత్తాంతమును బకాసురుఁడు దేవరవారి కెఱిగించుమనుటుల చెప్పి పంపియున్నాఁడు. వాఁడుం డెడిగంధమాదనపర్వతప్రాంతమున బ్రాహ్మణులుమిక్కిలి జన్నములు చేయుచున్నారనియు, నాయజ్ఞములయందు హవిర్భాగముఁ గొనుటకై దేవతలువచ్చి విఱ్ఱవీగుచున్నారనియుఁ జెప్పిపంపియున్నాఁడు.

కంస—ఏమి! యేమి! ఆబాపలు దుర్మదాంధులై నన్నుగాదని దేవతులకునై జన్నములు చేసిరా? మంచిది. వారికిఁ దిటిపెపులిండివలన గర్వము తలకెక్కఁగాబోలు. మీరిప్పుడే యాబకాసురునకు వారినందఱిని నలచి, కలఁచి ద్రొక్కించి మ్రందించి, సంహరించునటుల నాకట్టడిఁ బంపుడు.

ధేనుక—దేవా! ఈ జన్నిగట్టులగు బాపఁలెంత వెఱ్ఱివారలు? దేవుఁడనఁగ నీకంటె నెవఁడు? విష్ణువనఁగ నీకంటె నెవఁడు? శంఖచక్రములు లేవుగాని యా చక్రివే నీవుగావా?

కంస—ఛీ ఆమాటవకుము. వానికొక్క చక్రమే యుండునది. నే నన్నన్నో వేనవేలు చేయించియున్నాను.

ధేనుక—అయిన మీరే విష్ణువు.

కంస—సందేహమేమి? విష్ణువు? విష్ణుపితామహుఁడను. మఱియు పలికిన విష్ణుప్రపితామహుఁడను. నేను వానివలె దొంగవనిఁజేయుదునా?

అఘాసుర—రాజేంద్రా! మన ప్రజలందఱిని దేవాలయములయందు మీప్రతిమల పూజించునటుల నేర్పరచి యున్నాను.

కంస—భళిరే! భళిరే! నీవుగదా నామది కెక్కువాఁడవు?

[ప్రవేశము: సేవకుఁడు.]

సేవక—దేవా! వరాను. కారాగృహమున మనదేవకమ్మ చిన్నబిడ్డను కనినది.

కంస—మీరు శీఘ్రమునఁ బోయి యా శిశువుతోడ వారినిఁ దోడుకొనిరండు. పొండు.

సేవక—భాగ్యము.

(నిష్క్రమము.)

కంస.—ఇదియేగదా యెనిమిదవగర్భము? దీని నుపేక్షింపరాదు. దీనినిప్పుడు చక్కాడిన నా కెదురెవ్వరుగలరు? ఆహా! పురుషప్రయత్నమునకు నసాధ్యముగలదే? ఎట్టి యసాధ్యకార్యములైనను ప్రేల్మిడి సాధింపనగునుగదా?

[ప్ర. దేవకి వసుదేవులతో సేవకుఁడు.]

సేవక—దేవా! మీయానతి మేరకు వీరినిఁ గొనితెచ్చియున్నాను.

కంస—(దేవకిని సమీపించును.)

దేవకి—అన్నా! క్షమింపుము. నాపై దయరానిమ్మా. ఇది నీ కోడలగుఁగాని యల్లుఁడుకాఁడు. నాయష్టమగర్భమున జనించిన పుత్రుఁడుగదా నీకుఁబగవాఁడని వింటివి? ఇది నాపుత్రుఁడు కాదు. పుత్రికయగుఁగదా? దీనిని వధింపవలయుననెడి పగయేల?

ఉ. అన్న క్షమింపుమన్న, తగదల్లుడుగాదిది, మేనకోడలౌ
మన్ననసేయుమన్న, విను మానినిఁజంపుట రాచవాడిగా
దన్న సుకీర్తి నైమనగదన్న, మహాత్ములుపోవుత్రోవ బో
వన్న, భవత్సహోదరిగదన్న నినున్ శరణంబు వేడెదన్.

కంస—అవియన్నియుఁ గట్టిపెట్టుము. దీనినా విడుచుట? పుత్రుఁడో పుత్రికయో. నీయెనిమిదవచూలు నాకు మారకమనివింటిని. కాన విడువను. ఊరక శిశువునిచ్చి యూరకనిలువుము.

దేవకి—అయ్యో! సహోదరుఁడవే? నాకోరిక యింతమాత్రము చెల్లింపరాదా? కట్టా! నా గర్భమునకుఁ జిచ్చువెట్టితివి. నా యార్గురునందనుల వధించితివి. అంతట తనివిదీరక నొక్క యాఁడపడుచు, అబల, కసిగందునుసైతము చంపయత్నించెదవే? అన్నా! నీ మదికేల కరుణగలుగదు? నాపాపఫలము లుండి నిన్నేలననవలయు? ఆహా! చంపెడి పగవానికైనని

చుక యక్కటికము కలుగుఁగాని నీకుఁ గలుగకున్నదిగదా ?

(అనుబంధము 19)

అన్నా! నిను చెఱఁ గొడ్డి వేడెదను. నాకు పుత్రికాభిక్షమిమ్ము. నన్ను చెఱలిమ్మని వేడను, సొమ్ములు కావలయునని యపేక్షింపను. మణిమయమందిరమ్ములుకట్టించియిమ్మనికోరను. భూములిమ్మని ప్రార్థింపను. ఈ కన్నియకుఁ బ్రాణదానమొసంగుమని ప్రార్థించెద. ఇంతమాత్రము చెలియలిపై కరుణించినఁ దప్పగునా ? అయ్యో! ఒక్కరిని కాదు. ఆఱుగురిని నీకు బలియిచ్చితినే ? ఇంకను తనివిదీరలేదా ? ఈచిన్నబిడ్డపైన కనికరము లేకున్నమానె గాని నీసహోదరిపైనైనను కరుణగలుగదా ? అకటా ! పశువులనరికి రక్తమాంసముల విక్రయించు కటికవాఁడైన నొకపరి తనకసుపునందు దయవహించును గాని నీవు కావుకావుమనివాపోవు పసికూనలయాక్రందనమునైన వినక ఖండించెదవే ? నా యొక్క ప్రార్థనముఁ గైకొనుము.

సీ. ఇన్నాళ్ళు చెరసాల కన్నహింసలఁ బెట్టి
నంతైన సంతోషమలర లేదె
కన్నీరు మున్నీరుగా మేము శోకింపఁ
గటికమానస మింతకఱుగ లేదె
కన్నులు తెరవని చిన్నిపాపల నీకు
బలియిచ్చి తదితృప్తి గలుగ లేదె
నేఁడిదే నీమేనకోడలే వేడదే
యోడులేనికరుణఁ జూడవలదె

గీ. మానుమా యిఁకనైన నీకూనఁగనుచు
మాన నీపాదమానసే మానమాన

హీనమా, విధానమ, నీపరిమానమాన
మానదీన మానినిఁగను మానవేశ.

నాపుత్త్రిని నాకిమ్ము. ఇదె నీచరణములపైఁబడి వేడెద. (అని కాళ్ళపైఁ బడును.)

కంస—ఛీ. అవలపొమ్ము. (అని కాలఁదన్ని) అల్లుఁడు కాఁడఁట మేనకోడలఁట ఎవ్వరైననేమి? నే చంపనే వలయునని వ్రతిన పట్టిన యావ్రతిన విడచుట నా జాతకమున వ్రాయనిపని. దాసిని విడపించుట నీకుఁ గాదుగదా నిటలాక్షునకైనను శక్తి చాలదనుకొమ్ము. ఎన్నఁడు నీశిసువులు నాకు శత్రువులని నారదుఁడు వచించెనో యాదినమే నీతనయులు నాఖడ్గధారకుఁ జిక్కినవారే. నాకు నీవు చెల్లెలివి కావు. నేను నీ కన్నను గాను. నీవు నా ప్రాణంబులకై జనించిన మారివి. పగదాయివి. ఘాతకివి. నిన్ను సంహరించి నాకులమును నా మానసమును నిష్కల్మషముగా నొనరించెద. మితిమీరి పల్కిన నిన్నును నీపెనిమిటియు మృత్యుముఖమునకుఁ జిక్కినవారనుకొమ్ము. నన్నిఁక "యగ్రజా!" యని సంబోధింపకుము. నే నగ్రజుఁడను గాను. నిన్ను నీతనయులను పొలిపుచ్చుటకై జనించిన ప్రేతనాయకుఁ డనుకొమ్ము.

(అనుబంధము 20)

దేవకి—ఓరీ! ఇంత బతిమాలుచున్న నీసోదరిని చరణాహతిఁ బడద్రోసితివా? మదాంధా! నన్నుఁదన్నిన నీయవయవంబులు దిక్కులేక మహావ్యాధిచే నుడి సంధిబంధములు వీడి పురుగులుపడి శ్మశానంబున కాకంబులు సైతమంటక కుళ్లి, దుర్గంధముపట్టి ముఱిగిపోవుగాక. నీచాత్మా! ఆడుబిడ్డలకన్నీరన్న నూరకపోవదు సుమా. పుట్టినింటిని గల్చికాని చల్లారదు. నేను నీసా

లికి మారినైతినిగదా? ముందు నీకు రాఁబోయెడి దురవస్థను నీ నోట నుడువుచున్నాఁడవు. అటులనే కానిమ్ము. నీపాలికి మహామారినే యయ్యెద. నేను చెలియలిని కానా? ఔనా? నిక్కము వచించెదవా? నీమనఃపూర్వకముగ నాడెదవా? నీకు వినాశకాల మాసన్నమైనది. నిజము. నీయట్టిక్రూరాత్మునకు నేఁజెల్లెలిని కాను. కాఁజాలను. కానొల్లను. దురాత్మా! పుత్రఘాతకా! చేయుము నీవలసిన పాపములన్నియు. నాగర్భదవానలము నిన్ను మొదలంటఁ గాల్పకమానదు.

కంస—పాపినీ! కులపాంసనీ! దూషించెదవా? నీ వింతవఱ కాడిన యవాచ్యములై, యతిపాపములై, యన్యాయాకరములై యున్న నీమాటల నాలించుట తత్కాలమున జనించిన మహత్తర క్రోధాభిభవనిశ్చేష్టాభరమున సంభవించిన స్తంభా వబుద్ధిచేఁగాని నీ యసమంజస వాక్సరణినంతయుఁ గొనసాగ నాకర్ణించు నభిలాషమునఁగాదు. ఇఁక నొకమాట నీనోటి నుండి వెలువడిన నీనాలుకఁ గోసెద.

దేవకి—పాపాత్మా! నే నన్యాయరీతి నుగ్గడించితినా? అధర్మమును భాషించితినా? నానాలుకఁ గోసెదవా? ఇట్టి దురుక్తులాడిన నీజిహ్వాగ్రమును మనవృత్తములఁ దిలకించుచున్న ధర్మదేవతలు ఛేదింతురుగాక. నీ పాపకార్యములను నీ యధర్మమును జగమెఱుఁగు. ఛీ! నీతో మాటలాడిన దురితమగును. ధర్మాధర్మముల నెఱుఁగుటకు నీమన సొకసాక్షి గాదా? సర్వకర్మముల తత్వమునుఁ బరీక్షించి గాంచెడి కర్మసాక్షి యొకసాక్షి కాదా? ఈ సభాస్థానముననున్న సింహాసనాధిదేవత యొకసాక్షి కాదా? కార్యానంతరముననైన, తత్ఫలానుభవవేళనైన నెఱుక గలిగించు నీ యాత్మసాక్షి యొకసాక్షి గాదా? కానిమ్ము.

నీసుఖము పాపకరము. నీచెలువు పాపకరము. వేయేల? నీ జన్మము మహాపాపనిచయాలవాలము. నీవు నన్నుపాపిని యనెదవా? నీవు నన్నుఁ జంపెదవనుభయము నా కించుకయైనను లేదు. నాపతిసన్నిధానమున సుమంగలీమరణసుఖమును పరమసంతసమున భరించెదగాని నీపాపపుమోముఁ జూడనోప.

కంస—ఆహా! పాపిని! చచ్చితివి. రమ్ము. నిన్ను చంపినగాని నీదురుక్తుల విడువను. (అని పైనఱికి వెండ్రుకలఁబట్టి క్రిందికీడ్చి ఖడ్గము నెత్తును. సభవారందఱు దిగ్భ్రమమునఁ జూచుచుందురు)

(అనుబంధము 21)

దేవకి—(ఏడ్చుచు) సభాస్తారులారా! పౌరులారా! దేవవర్గములారా! ఈ పాపాత్మునిఁ గంటిరే?

సీ. ధర్మంబు పాలింప ధర్మపీఠమునందు
సన్నివేశించిన సభ్యులార!
దుష్టుల శాసింప శిష్టుల రక్షింప
గ్రాలెడు సత్యాధికారులార!
"సత్యమేవ జయతి సత్యమిదం" బంచు
దివిమించుమ శ్రీసత్యదేవులార!
పరిత్యక్తదైవమై పరధర్మమునుఁ జూపు
సింహాసనన్యాయసిద్ధులార!
గీ. కంటిరే యిట్టి పాపంబు కన్నులార!
అన్నయఁట, చంపునఁట, చంపునంచు వెఱచి
తనయ నొసఁగుదునంట నో యనఘులార!
మీరు ధర్మము పాలింపఁగారె లేరె.

వీని మ్రిందించి నామసన్నుతసముఁ జేయువారు లేరే? వీరి యాండ్రు
విధవలై ఘోరదుఃఖ మనుభవించు కాలము గాదే?

సీ. కలుఁగడే మాకొందు ఖలులశాసింపంగ
నేర్చువాఁడు శుభంబుఁ గూర్చువాఁడు
మా బాలఁబ్రోవఁడే మహితభక్తులపాల
కలగువాఁడు మహాబ్ధి మెలఁగువాఁడు
మా బాధమాన్పఁడే "మాంపాహి" యనువారి
వినుచువాఁడు నఘము నణచువాఁడు
మాకు తోడైరాడె మహీననాథుల బుద్ధి
నొంచువాఁడు తనంత మించువాఁడు

గీ. కరుణగలవాఁడు, భువిరేఁడు, కలిమిరేఁడు
అకటమన్నీఁడు, మున్నీటియల్లువాఁడు
మమ్ముగావఁడె, మనుపఁడె, మదినిగనఁడె,
తలపఁడే, రాడె, యేలఁడే దయను గనఁడే.

కంస — తెమ్ము నీ బిడ్డను. నీకన్నులెదుట దానిరక్తధారను నీకుఁ ద్రావించెద. నన్ను దూషించినందుకు నీకదియే ప్రతిఫలము. (అని బిడ్డను గుంజుకొనును వసుదేవుఁడొక చేతిని దేవకియొక చేతినిఁ బట్టుకొని యేడ్చుచుందురు.)

దేవకి — నీ కీతన్వి నివ్వను. పరమాత్మా! దేవాధిదేవా! నాకుమారినిఁ గాపాడుము.

వసుదేవ — దురాత్మా! విడువు మీచిన్నిపాపను

కంస — నే విడుతునుగాని నా ఖడ్గదేవత విడువఁజాలదు.

దేవకి — అటులనే నిన్ను ఘోరవాదినరకములుకూడ విడువఁజాలవు.

కంస — ఇట్లాడిన మీయసువులు మీయం దుండఁజాలవు.

(అని కంసుఁడాబిడ్డను పై కెగయవేయును. ఆపడుచు పైన నెగసి
పుష్పాలంకృతమై యాకసమున నిలుచును. దేవకీవసుదేవులు
మూర్ఛనొందెదరు.)

శక్తి—ఓరీ కంసా! నన్ను నీవేమియు చేయఁజాలవు. నేను నీ[illegible]
కన్యే జనించియున్నదానను. కాళియన, మారియన, శక్తి
యన, లోకసన్నుతవైభవమున వెలయుదాన. నిన్ను చంపువాఁ
డప్పుడే యుద్భవించియున్నాఁడు. ఇఁక నీవు మనఁజాలవు.
(అనఁగా కంసుఁడు మొదలగువార లట్టె యాశ్చర్యమున
నిలుతురు.)

కంస— (అనుబంధము. 22)

యవనికజారును.



శ్రీ

# కృష్ణలీలనాటకము.



## తృతీయాంకము—ప్రథమరంగము.

రేపల్లెలో యశోద మందిరము.

[ప్రవేశము:- కమల—కళావతియను నిరువురు గొల్లముత్తైదువలు.]

కమల— చెలీ కళావతీ! ఇన్నిదినములకు మన యశోద చిన్నమగ వానిఁ గనెనఁట. ఆ చిన్నవాఁడు పుట్టిననాల్గుమాసములకే నడ వఁదొడఁగెనఁట. అయిదవమాసమందే ముచ్చటగ మాటలాడ సాగెనఁట. ఇది యేమబ్బురము?

కళావతి—అదేమి యగుదే? ఆ బాలుఁడు దేవాంశసంభూతుఁడని మనపురోహితులు చెప్పలేదా? అది యట్లుండనిమ్ము! కమ లా! మనయశోద యేమో పుత్రవతియయ్యెను. ఇఁక నీవె న్నఁడు ప్రసవించెదవే!

కమల—చాలునే నీహాస్యము. అది యుండని. మన నందునిదే యదృ ష్టము మొదటిభార్య రోహిణీదేవి యొక బాలుని, రెండవ భార్య యశోద యొకబాలునిఁ గనిరి. ఒక్కటేసారి యతఁ డిరువురుకొడుకులతండ్రి యయ్యెఁగదా?

[ప్రవేశము: శీఘ్రయానమున యశోద.]

యశోద—(కళావతిఁ జూడకయే) కమలా! కళావతి వచ్చినదా?

కమల—(కళావతినిఁ జూపి) ఇదిగోనమ్మా! ఇక్కడనే యున్నది. మే మిరువురము కలిసియె వచ్చితిమి.

కళావతి—(ఎకసక్కెముగ)కలుగక కలుగక నీకు మగచిన్నవాఁడు కలిగియుండుటేమి? ఇట నామకరణమహోత్సవము జరుగుచుండుటేమి? మాబోఁటి బీదవారు కంటఁబడుట యనఁగ నేమమ్మా!

యశోద—కళావతీ! నేను నిన్నుఁ జూడలేదే! దానికై యింత నిష్ఠూరమా?

కళావతి—ఇప్పు డట్లు చూచెదవమ్మా?

యశోద—నీకెప్పుడును నిష్ఠూరము సహజమే, పోనిమ్మా. కమలా! మన విద్యుల్లేఖ కింకనుఁ దీరిక కాలేదేమో?

కమల—అమ్మా! ఆమె మావలెనా? గొప్ప యుద్యోగస్థుని భార్య. ఇట వంటలు వార్పులు చేయించి, మరుపులు గిరుపులు వేయించి పిదప జ్ఞాపకమునకువచ్చిన వచ్చును.

యశోద—అదిగో! తలచుకొనువేళకే వచ్చె విద్యుల్లేఖా! నీకు నూరేండ్లాయుస్సమ్మా! ఇప్పుడే నిన్నుఁ దలఁచుకొంటిమి. ఇంతలోననే నీవును వచ్చితివి.

విద్యుల్లేఖ— లేదమ్మా! అప్పుడే వచ్చుచుంటిని. మా యెదుటింటి కామాక్షి "నేనును వచ్చెదను. కలిసి పోవుద" మని చెప్పెను. ఎంతసేపు కాచినను రాదాయె. వేసరకొని నేనేవచ్చితిని.

యశోద—ఇప్పటికాలము వారికి కార్యములయందు దృష్టియే లేదమ్మా. మఱియు నూరిబయట విహరింపఁబోవుట; వార్తాపత్రికలఁ జదువుట; రచ్చటరుగునఁ గూర్చుండి యూరివారిపురాణముల జదువుట. అది యుండనీ. పేరంటాండ్రెందఱు వచ్చినట్లు యయ్యెగదా? ఇఁక ప్రారంభింతమా?

[ప్రవేశము — సరోజిని.]

కమల— కానిమ్ము. త్వరగా పేరంటము చేసికొని పొద్దుకలుగ నింటికిఁ బోవలయును. ఇప్పటికాలము చెడ్డది.

విద్యుల్లేఖ—నిజము. యశోదమ్మా! ఏదీ నీకుమారుని జూపక పోయితివే? నేనేవచ్చి చూతమన్న నిల్లు చాలాదూరము. అందులో వేసవికాలము. ఎండ ప్రబలినందున రాఁజాలక పోతిని. పిలిపింపుము.

యశోద—పిలిచెదనమ్మా!

(అనుబంధము 23)

[ప్రవేశము శ్రీకృష్ణుఁడు తాళము వేసికొనుచు. అందఱు నెత్తి ముద్దాడుదురు.]

యశోద—(కృష్ణుని పీటపైఁ గూర్చుండఁబెట్టి) కమలా! నలుగు పాట పాడవే.

కమల—నాకురాదమ్మా. సరోజినీ! నలుగుపాటుట పాడుము.

సరోజినీ—ఏమొయ్యారమే పాడుమంట? ఈ వయ్యారములు మేమెఱుఁగమమ్మా

కమల—ఒయారమేమే? మొన్న రాధ సమర్తాడినపు డెంత బాగుగ పాడితివి చూడుము. ఆపాట పాడుము. పోనీ. కళావతీ! నీవు పాడుము.

కళావతి—నాకు కొత్తకుండలోని నీళ్ళు త్రాగి గొంతురాసినదమ్మా. "ఆ" యన నియ్యదు.

యశోద—సరిపోయె సంగీతపాటకుల కిది మొదటిరోగము. విద్యుల్లేఖా! నీవు పాడుమమ్మా. నీకును నాకును దప్పినది కాదు.

విద్యుల్లేఖ— బాగుగనున్నది. నన్నా పాడుమనుచున్నది? అప్పను పట్టుకొని వసంతము లాడెనట.

కమల—నిజమే. నీమగఁడు యాదవసింహుఁడు వసంతమాట విడిచెనా ?

విద్యుల్లేఖ—చాలు నే వ్యారకుండుము.

యశోద—మీరేల కొట్లాడెదరు నేనే పాడెదను లెండు. (అని కృష్ణుని తొట్లలోఁ బరుండఁ బెట్టి)

(అనుబంధము. 24)

శ్రీకృష్ణ—(ఉయ్యెలలోనుండి దిగ్గున లేచి) లక్ష్మణా! తెమ్ము నాధనువు. తెమ్ము నాచాపబాణములు. ఈ సముద్రము మద మణఁచెద. ఎంత ప్రార్థించినను దారి యివ్వకున్నది.

(అనుబంధము. 25)

(గోపకాంతలు సశ్చేష్టులై చూచుచుందురు.)

[ప్రవేశము—శీఘ్రమున నుద్ధవుఁడు.]

ఉద్ధవ—దేవా! కోపము చాలింపుము. కోపము చాలింపుము. నీవు రామావతార మొందినతరి సముద్రముపైఁ జూపినకోపమును జూపుచున్నాఁడవు. ఇది రామావతారము కాదు, కృష్ణావతారము. రామావతారకథను మీతల్లి పాడుచున్నది. ముఖ్యభక్తుఁడు. ఉద్ధవుఁడను విన్నవించుచున్నాఁడను.

(అనుబంధము 26)

శ్రీకృష్ణ—ఉద్ధవా! తెమ్ము. నిక్కము. నే రామావతారమని యే భావించియున్నాఁడను. అమ్మా! అమ్మా! ఇదేమే యింత భయంకరరూపము! నాకు భీతి కలుగుచున్నది.

యశోద—(కృష్ణునిఁ గౌఁగలించి ముద్దాడి.) ఏమిభయమును గంటివి నాయనా? ఏమి కనుపించెను?

యశోద—సీ. కలలోన నేరూపు కంటివో గోపాల
పడరానిభయ మూపు పడితివన్న

శ్రీకృష్ణ—కలలోన జగములే కంటిని యోతల్లి
భయమొక్కడిది యంతభ్రాంతియమ్మ
యశోద—ఎక్కడిరాముండు నెక్కడిలక్ష్మణుం
డేమేమొ పలికితి వేలకృష్ణ
శ్రీకృష్ణ—రాముండ నేగాదె రహిలక్ష్మణుండ నేనె
యాశ్చర్యమిందేమి యలరునమ్మ
యశోద—గీ. ఏటిమాటలో నాయనా! యెఱుకవడవు
శ్రీకృష్ణ— మాటలన్నియు నావెగా, బూటకములు
యశోద—పిచ్చియిదియేమొ తెలియదు వెఱ్ఱికృష్ణ!
శ్రీకృష్ణ—పిచ్చివదలిన గాంతుపీ పిచ్చి, తల్లి.
కమల—యశోదా! మంచికొడుకునుం గంటివి. ఇదియేమి రాముం
డే? పిచ్చిపట్టినచందమునం జేయుచున్నాడు?
కళావతి—చెప్పలేదేమే యితని వృత్తాంతము మిక్కిలి యాశ్చర్య
మని.
విద్యుల్లేఖ—ఆశ్చర్యమటుండ మనబాలుండు భయపడినాడు. రక్షపెట్ట
వలెను.
యశోద—ఔనమ్మా రక్ష పెట్టవలెను. దేవగృహమునకు పోదము
రండు.

(అని యందరు నిష్క్రమించు.)

(ఱి)వేళము—పూతన.)

(అనుబంధము. 27)

పూతన—ఆహా! ఇదియే కదా నందుని యిల్లు? ఇప్పు డాకుమారు
నెత్తుకొనిపోయినదియేగదా యశోద? అల్లదే తల్లికౌంగిటం
జేరి ముద్దులొలుకుచు నవీనావతార మొందిన యభినవకంద
ర్పునిఁబోలె వెలయువాఁడెగదా ముద్దులకృష్ణుండు? ఈచిన్ని

కసిగందువా మాకంసుని వధించువాఁడు ? ఔరా ! ఒక పంటజప్పరించినఁ జాలని యీకుఱ్ఱనికై యీకంసుఁడు రాత్రింబవలుఁ బరితపించుచున్న వాఁడు. "దేశ దేశము వెదకి పల్లె పల్లె నన్వేషించి యిల్లిల్లు వెదకి యెందానందునిపట్టి యున్నను బ్రమందింపు" మని వారికిఁ గట్టికట్టడియొనర్చి యున్నవాఁడు. వీని సంహరించుటకు నేఁగావలయునా ? మాకంసుఁడెంతటి వెఱ్ఱిరాజు! అయిన నేను నిజస్వరూపముతో పోయిన నచ్చటనున్న గోపికలందఱు భయపడుదురు. కావున నేనును నొక యాదవాంగనరూపమును గైకొని యీపసిపాపని నెత్తికొని, యిదివరకే నా స్తనసీమ ధరించిన విషము నెల్లను ద్రావించి మడియించి మారాజు మెప్పు వడసెదగాక.

(అని నిష్క్రమించును.)

[పునః ప్రవేశము—యాదవాంగనలు.]

యశోద—కుమారా ! యెంత భయపడితివమ్మా ?

శ్రీకృష్ణ—ఏమియు లేదే ?

యశోద—మాటలన్నియు నావే నేను మాట్లాడక యింకెవరు మాట్లాడవలయు ?

[ప్రవేశము—మాయాపూతన.]

(అనుబంధము. 28)

యశోద—అమ్మా ! రమ్ము కూర్చొనుము. ఎవరు నీవు ?

పూతన—అమ్మా ! మాది యిక్కడనే యొకపల్లె. ఈయింటి పేరంటాండ్రిమో పాడుచున్న వినవచ్చితిని.

యశోద—అట్లనా? అమ్మా! రమ్ము కూర్చొనుము. కస్తురీ! పోవే కుంకుమ, పసుపు, తాంబూలము తెచ్చియియ్యవే.

[కపిలపోయి పై వాటిని దీసికొనివచ్చును.]

యశోద.—అమ్మా! బాలునిఁజూచెదవా? ఇదిగో యెత్తికొనుము.

[అని బాలుని నిచ్చును.]

పూతన—(బాలుని నెత్తుకొని ముద్దాడి) అమ్మా! యీ బాలున కెన్ని యేండ్లు?

యశోద—ఎక్కడిదమ్మా! మూడవయేఁడు.

పూతన—అమ్మా! నీకుమారుఁడు మంచి లక్షణవంతుఁడు. లక్షణములన్నియు బాగుగానున్నవి మంచి శక్తివంతుఁడు నగును.

శ్రీకృష్ణ—అమ్మా! నాశక్తి యీమెకు బాగుగా దెలియును. తెలియకున్న ముందైనను దెలియగలదు.

గీ. అమ్మ! యీమెకు నాలీలయంత దెలియు
యీమెకును నాకు స్నేహంబదెంతొగలదు
పూని యీమెకు మారకుడేనె యగుదు
నింక పరలోకసుఖముల నిత్తునమ్మ.

పూతన—ఇదియేమమ్మా? యీ యీకునకే యిట్టిమాటలాడుచున్నాడు? వీఁడు మిక్కిలి మాటలమారియగును. (అని చన్నిచ్చుటకుఁ బ్రయత్నించును.)

యశోద—అమ్మా! బాలునికి స్తన్యమిచ్చెదవా? ఆ మరుగున గూర్చుండి పాలిమ్ము.

శ్రీకృష్ణ—అమ్మా! యీమె నాకు చనుపాలొక్కటియే కాదు తనకున్నవన్నియు నిచ్చును. ఈమెకు లేనివన్నియు నేనిచ్చెదను. (శ్రీకృష్ణునితో మాయాపూతన నిష్క్రమించును. గొప్ప ధ్వనివినఁబడును. శ్రీకృష్ణుఁడు స్వస్వరూపముననున్న పూతన నీడ్చుకొనివచ్చి రంగమున బడవైచును.)

యశోద—(ఆతురముతో కుమారు నెత్తుకొని కృష్ణా కృష్ణా! ఎవ్వతె యీ రాక్షసి. నీవీమ్చుకొని వచ్చితివి? ఇది చచ్చుటకై తన్నుకలాడుచున్నదే? దీని నెవరు చంపిరి? ఏమో నీచరిత్ర మొక్కటియు నాకుఁ దెలియకున్నది. రాజీవముల నేరుకన్నుగవ లేతలికులచూచినంత భయమ్మునొందు నీ వీభయంకరాకారము నెట్లు గాంచితివి. నెత్తావి విరిజాజుల తాకినంతట వశివాళువాడు నీకరపల్లవములు కూ్రర రాక్షసీకఠినతరాంగము నెట్లు స్పృశింపఁగలిగె? అన్నా? తెలిసియు తెలియనివానివలె నున్నావు.

సీ నవశిరీష కాంతి నిరసించు నీమేను
రక్కసి చేనెంత స్రుక్కెనన్న
స్థలపద్మకాంతి నేస్రములాడు క్రొవ్వ
యోటుల నంభీతి చలించెనన్న
అతిసుధాప్రసరాభి హాసరుచా లేఁబాడ
లందందు నెంతగా కందెనన్న
నవీనవాళి విభూతి నెలరారు నిరుబాహు
లడఁగి యెట్టుల కాంతి విడిచెనన్న
తే. గీ. కటకటా! యిది యెట్లు కలిగెనన్న
ఎంచ నెపాపిమొగ మిందుఁ గాంచితన్న
చిన్నపాపడ నాప్రోడ చిఱుతకేడ
రమ్ము రమ్మన్న మాయన్న రాగదన్న.

శ్రీకృష్ణ—అది నాకే తెలియదు. నీకెట్లు తెలియునమ్మా?

చ. తెలిసినవాఁడగాను మఱి తెల్విపి బాసినవాఁడగాను స
ద్దెలిసినవారు లేరు మది తెల్వియె నేఁటు నాక్రియాదులే

తెలియును దాని తత్వమునుఁ దేటగఁ గాంచిన పెద్దవార లా
తెలివిని గాంతురమ్మనగఁ బ్రోపగజాలుదు రమ్మయమ్మరో.

యశోద—కమలా! పోవే మనవారినిఁదోడ్కొని రమ్ము.

(కమలపోయి నందుని నవనీతునిఁ బిలుచుకొనివచ్చును.)

నంద—(పూతననుఁజూచి) ఆహా! ఇది యేమి వికారిణమో తెలియదమ్మో. ఓరీ! నవనీతా! మనగర్గాచార్యుల వారినిఁబిలుచుకొనిరమ్ము.

(నవనీతుఁడు పోవును.)

నంద—కామినులారా! ఏమి యీయనర్థమునకుఁ గారణము?

యశోద—మేమందరము మనకృష్ణునకి జోలపాటఁబాడుచుండ నెవ్వరో యొ స్త్రీవచ్చి లోనికిఁబోయి బాలునకిఁ బాలివ్వ గొప్పధ్వని గలిగెను. అంతలో నీయనర్థము గలిగెను.

[ప్రవేశము—గర్గాచార్యుఁడు.]

గర్గ—అయ్యా! ఏలపిలుపించితివి? (పూతననుఁజూచి) ఆహా! ఏమి యీపూతన యిక్కడ చచ్చిపడియున్నది? దీని నెవరు చంపిరి? దీనిదర్శనమున్న మృత్యుదర్శనమే?

యశోద—ఆహా! ఇదియా పూతన? స్వామీ! ఇది యంతయు మా కృష్ణుని చరిత్రము.

గర్గ—అట్లు చెప్పుడు. ఇదియంతయు కృష్ణలీలయా? ఇది పూతనయను రక్కసి. కంసునకు కూర్చుదాసి. యోచింప నాకంసుఁడే మన కెగ్గుచేయఁదలఁచి యీపూతననుఁబంపి యుండనోపు. మనకృష్ణుఁడు దీనికనిఁ దీర్చియుండవలయును.

నంద—స్వామీ! ఇదికల్ల. ఈరక్కసి నన(గనేమి? ఈబాలు(డు చం
పుట నన(గనేమి? నేను నమ్మ(జాలను. ఈపాపని కేమియు(
దెలియదే? ఇట్టివాని కెవ్వరు బాధకలిగించిరో?

శా. తేరే బాలకులెందు వారినిగనన్ లీలావతుల్ రారె యిం
పారన్ కౌ(గిట(జేర్పరే ముదమునన్ బాలివ్వరే చూడరే
వా రేరీపసిపాపలన్ దునుము పాపవ్రాత్యు లీపూతనన్
పేరేపి దిరో పాపచిత్తులకు నే వేళన్ దయల్ గల్గునే.

శ్రీకృష్ణ—చూడుము నాకేమియు( దెలియదే. ఈయన యేమో
చెప్పుచున్నవాడు.

గర్గ—అయ్యా! నీకేమి తెలియును? లోకమునందలి తెలివియం
తయు నీవేకావా? నిన్ను(దెలిసికొనువా(డెవ(డు? నందాదు
లారా! యీవృత్తాంతమంతయును వచి(చెదను రండు.

యశోద—స్వామీ! వృత్తాంత ముండనిండు ఈబాలు( డీరాక్షసిని(
జూచి యెంతభయపడెనో యేమి కీడురానున్నదో యని భయ
మగుచున్నది. తా మనుగ్రహించి కొంచెము మంత్రింపుడు.

గర్గ—కుమారా! రమ్ము. మంత్రించెదను. మంత్రమును మంత్రస్త
మును మంత్రఫలమును నీవేకదా. చేరవలయు.

(నిష్క్రమము.)

---

తృతీయాంకము—ద్వితీయరంగము.

రేపల్లెయందు నందగృహము.

[ప్రవేశము—యశోద.]

యశోద—మాకృష్ణుని యుదంతము పరమాద్భుతముగానున్నది.
"మూర్తి కొంచెము కీర్తిం చెను" యన్నట్లున్నది. వచ్చియు రాని
మాటలతోనున్నను కార్యములవాజ్మానసగోచరములగు న

నున్నవి. మున్న పూతననుఁ బరిమార్చుట యన్ననో చెప్పనల వియే కాదు. ముచ్చటలాడుచుండ మాటలమృతపు తేటలై యున్నవి. ఇట్టి ముఱిపెములమూటగట్టు మాకృష్ణయ్య నొక్క నిమిషము విడనాడవలయునన్న నాకు సాధ్యముగాకయున్నది. గర్గాచార్యులు వచించెడి తీర్లనంత విచారింప నతఁడు దేవాంశసంభూతుఁడనియు నీగోపాలకృష్ణుని మహిమ మాబోటివారికిసైతము తెలియ[illegible]యు వచించిరి. నాకేమో యీ కుమారుని యందొకతూరి భక్తియు నొకసరి పుత్రవాత్సల్యమును గలుగుచున్నది. లేక లేక సంతానముగలిగినందున కిపిచ్చి భ్రాంతిగలిగియుండునా? ఉద్ధవకుమారుఁడు యాదవబాలుఁడు తనకు భక్తుఁడట; తాను వాని కుపదేశించువాఁడట. అదేమియో యింత విచారింపవలయు నేదియెట్లున్న నేమి? లోకమునఁ బుత్రకులముద్దాడగలిగినవారిభాగ్యమే గదా భాగ్యము?

సీ. నిజసుతకటిసూత్ర నిర్మలభాస్వర
మణిశోభితాంక సద్వాదిత వనిత
పుత్రిక పరముఖాంభోరుహావ్యక్తసం
లీలానుభాషణా లోలబాల
ఆత్మీయనందన హాసిసూత్నకపోల
విధుబింబచుంబనా విదితముదిత
అభిరామతనయ ప్రేమాలింగనామోద
దాసభోగోద్దామ ధామ లేమ
తే. స్వర్గసుఖపుష్ప నిచయవసంతకాంత
లలిత సుఖబంధు గౌరవాకలన లలన

సఱికనళినతనూజాత కరిణితరుణి
కాంతిసుతయింతి విలసంతి శాంతి యింతి.

(అనుబంధము 29)

ఏల యింకను మా గోపాలకృష్ణుఁడు రాకయున్నవాఁడు? (అని యటు నిటుచూచి) అదిగో వచ్చుచున్నవాఁడు. మఱుగున నిలిచి వీఁచర్య చూచెదగాక. (అని మఱుగున నిలుచును.)

ప్ర—[శ్రీకృష్ణుఁడుద్ధవునితో; పాడుచు

(అనుబంధము 30)

శ్రీకృష్ణ—అమ్మా! అమ్మా! (అనినలుదిక్కులఁజూచి) ఎక్కడపోయి యున్నది మాతల్లి? ఓహో! ఆమెకాశ్చర్యము జనించి యున్నదేమో?

ఉద్ధవ—దేవా! అన్ని యాశ్చర్యములకు మూలము నీవుగదా? నీకంటె వేరాశ్చర్యముగలదా?

సీ. ఎద నిందిరాదేవినిడియు నీసునరూపు
చూపని యాశ్చర్యశూరుఁడీవె
శృతులందునడచి నీచిత్రంబుచూపక
చరియించు నాశ్చర్య పురుషుఁడీవే
సనకాది హృదయంబులనుసల్పి చిక్కక
పాఱిన యాశ్చర్య చోరుఁడీవె
జగముల నీవయై జగముల నంటని
యాశ్చర్య గారడి యనగ నీవె
తే. అన్ని యాశ్చర్యములమీరి యవనిఁజేరి
జగతి నాశ్చర్య క్రీడల వారివారి
చూడనాడించు నాటకసూత్రుఁడీవె
నవ్యగుణబృంద గోవింద నంద నంద.

శ్రీకృష్ణ—ఉద్ధవా! మాతల్లికి పాలుత్రాగుదునా పాయసముదిందు నా యని సందేహముగలిగినది.

ఉద్ధవ—కృష్ణా! నిన్నుఁగుమారునిగా పొందిన సందేహముండ గలదా? అంతకు మీతల్లి యెక్కడనున్నది?

శ్రీకృష్ణ—ఎక్కడనున్నది? మనమాట లాలింపవలయునని యిందు సందుగున దాగియున్న మాతల్లి నెక్కడచూపగలను?

[ప్రవేశము—శీఘ్రయానమున యశోద పాడుట]

(అనుబంధము 21)

యశోద—(కృష్ణు నాలింగనముఁ జేసికొని ముద్దాడును)

శ్రీకృష్ణ—జననీ! ఎక్కడనుండి వచ్చితివి?

యశోద—కుమారా! యెక్కడనుండి వచ్చితివననేల? నీకు తెలి యదా? యని యుండనీ. నీవెక్కడపోయియుంటివి నాయనా? ఎల్లెక్కడికినిఁ బోవరాదు. ఇంటివద్దనే యాడుకొనుచుండుము. చూచితివా మొన్న పూతనయను రాక్షసి నిన్నెంత బెదరించెను.

శ్రీకృష్ణ—అవునమ్మా! దానినిఁ జూచినంతనే భయము పుట్టెను. ఇంక నేను వెలుపల పోవనేపోవను. లోపలనుండును. కాని నాకొక బంగారు బండి నిప్పింపుమమ్మా!

(అనుబంధము 22)

యశోద—నాముద్దులయ్యా! నాకృష్ణస్వామి! ఏమిమాటలయ్యా యివి? అన్నియు నిచ్చెదను లెమ్ము. (అని ముద్దుపెట్టుకొని) ఇంకవందుకొనుము.

శ్రీకృష్ణ—చూచుచుమ్మా! మరి-మాయన్న రాముఁడు, నందరు పిల్ల వాండ్లు నన్ను "పూతనఁజంపినవాఁడు" "రాక్షసిని జంపిన వాఁ"డని యెగతాళిఁ జేయుచున్నారు.

యశోద—ఏమో? ఉండినను ఉండవచ్చును. నాయనా! నీవుగాక మరి యెవరు చదివిరి?

శ్రీకృష్ణ—లేదమ్మా! నేను కండ్లుమూసుకొని యుంటిని. మీరు గట్టిగా పరచదివిరి. అందుకే యది చదివిపోయెను. నాకేమి తెలియునమ్మా!

యశోద—నీ కేమియుఁ దెలియదా? కానిమ్ము. (అని కృష్ణుని నోరకు ముంచము పై పరుండబెట్టి పోవును. కృష్ణుఁడు నిద్రించినట్లు నిద్రించి తల్లిపోవగనే లేచును.)

శ్రీకృష్ణ—ఉద్ధవా! ఇటు రమ్ము. మనమాటకుఁ బోవుదమా? మన చెలికాండ్రెక్కడనున్నారో పిలుచుకొనిరమ్ము.

ఉద్ధవ—స్వామీ! మీతల్లి వలదని చెప్పిపోయెను? మన మాటలాడబోయిన నామెకు కోపము రాదా?

శ్రీకృష్ణ—పోఁ భయము రమ్మ! మాతల్లి కోపమును నేను తీర్చలేనా?

(ఉద్ధవునితో నిష్క్రమించును)

(వెనుక యవనిక నెత్తగా నొక పూదోట కనుపించును.)

[ప్రవేశము—శ్రీకృష్ణుఁడు బాలకులతో పాడుచు.]

(అనుబంధము 33.)

శ్రీకృష్ణ—మీరందఱు నేను చెప్పినట్లు వినవలయును. నేను రాజును మీరందఱు నాసేవకులు. నేను రాజ్యము నేలునట్లును మీరు నాయాజ్ఞకు లోఁబడినట్లు నాడుకొందము రండు ప్రజలకు రాజభక్తియే పరమభూషణము. పరమశ్రేయము. శిరమున ధరణీశాజ్ఞ్యము.

సీ. పాలించు రాజన్న పరమదైవము గాగ
భావించి పూజింపవలయునుండి

అరయు రాజాజ్ఞ దైవాజ్ఞగా నెంచుచు
లలిశిరంబున దాల్ప వలయునుండి
భూపతి కెంతైనఁ దాపంబు కల్గిన
తెలసి దానినిఁ బాపవలయునుండి
ధరణీశుఁ డెంతైనఁ దప్పులఁ జేసిన
ప్రార్థించి త్రిప్పగావలయునుండి

తే. గీ. పతికి హితమును దలపంగ వలయునుండి
ధరణినాయకుఁ గినియఁగా తగదుసూడి
రాజభక్తిని మఱవంగ రాదునుండి
అపుడు సద్గతి మనకెంకు నలరుసుండి.

(అనుబంధము. 34)

(ఒక విచిత్రమైన బండి ప్రవేశించును.)

శ్రీకృష్ణ—ఇదిగో! బండి, ఈబండి బాగుగానున్నది. దీని నెక్కి యాటలాడఁ బోవుదము.

ఉద్ధవ—కృష్ణా! వలదు. ఈబండి యేమో విచిత్రముగానున్నది. బండికి యెద్దులు లేవు బండిలో మనుష్యులు లేరు.

శ్రీకృష్ణ—బండి కెద్దులెందుకు కావలయురా? ఎద్దులు లేనిబండి నడుచుట నీవు చూడలేదా? అది యేమిచిత్రము? ఇఁక మనుష్యులు లేరన్న మనముకూర్చున్న మనమే మనుష్యులము

1. బాలక—నీయిష్టము బాబు. మేము రాము. కావలసిన నీవు పోయి యాబండి నెక్కుము. ఏయపాయము రాకయున్న మేమును వచ్చెదము.

శ్రీకృష్ణ—బాగుగనున్నది. ఒకరిమాటకొకరు వినకనే మనదేశమింత చెడిపోయినది మనమందరము నొకటేమాటగ నున్న మనగతి యిట్లేల గుచుండె? నేనే పోయెదను. ఎల్లుడు నీబండి

కని నాకునుఁ దక్కదు. (అని పోయి బండినికాలితో తన్నును. ఒక గొప్పధ్వని కలుగును. బండిలోనుండి యొకరాక్షసుఁడు వెలివడును. బాలకులు భయఁపడి పరుగెత్తిపోయెదరు. కృష్ణుఁ డా రాక్షసునితో యుద్ధమాడి వానిఁజంపును.)

(అవనికపడును.)

---

తృతీయాంకము—తృతీయరంగము.

చందుఁడను నొక యాదవుని గృహము.

[ప్రవేశము—కమల పద్మ యను వానిభార్యలు.]

కమల—పద్మా! ఏమిచేయవలయునే? ఎవరుండవచ్చును? పీడేయుండవచ్చునా? ఎంతమీఁగడ! ఒకనాఁడైన నుండనివ్వడే? ఎంత వెన్న! ఒకరికి సాధ్యమా?

పద్మ—పీడే యుండవలెనే. లేకపోయిన నంతలావుగా గుండ్రముగా నున్నఁగనుండునా? పాలుత్రాగిలావౌచున్నాడు. మీఁగడతిని గుండ్రముగానుంటున్నాడు. వెన్నమ్రింగి నున్నగాచున్నాడు.

కమల—నీవనుమాటనిక్కము. నాకీయనుమానముగలిగియే మూఁడు నెలలక్రిందట వానిపొట్ట కొలతవేసికొనియుంటిని. మొన్న చూతునుగదా! ఆరంగుళము లెక్కువయినది.

పద్మ—అబ్బ! మూఁడునెలలో నారంగుళములు? అందుకే గాబోలు నన్నమే తినఁడు. అయిన మాయత్త మాచుట్టు కొట్టుకొను చున్నదే? దానికేమి చేయవలెను?

కమల—కొడుకు గనుకంత యభిమానము. మాతల్లి మీతల్లి యిం దుండిన నెంత బాగుగనుండును?

[ప్ర- రక్తాక్షియును చందునితల్లి- మరుగున నుండి పైమాటను విని]

రక్తాక్షి- మీరు తినునదిగాక మీతల్లులు వేరే కావలెనో? తినితిని బాగ రుచికన్నారు. ఏమిచేసేరు? మీతల్లులెందుకు రావలెను? మీమగనితో కావడిలోనుంచి వెన్న మీగడ ప్రతిదినము పంపండి. వెధవముండకొడుకు. వేరుకని యేమున్నది? మీపేర నిన పడిచచ్చును.

కమల —(పద్మతో) వచ్చెనే పాడుముండ. మామాటలు మరుగున నుండి వినినదికాబోలు? ఇప్పుడిద్దరున్నాము. కొంచెము మన చెయ్యి చూపుదము. భయపడకుము.

పద్మ — అవును. అట్లనే కానిమ్ము. నేనేమియు భయపడను. (అని కాలిపై కాలు వేసుకొని కూర్చుండురు.)

రక్తాక్షి —ఏమే? నామాటలు కొంచెమైనను లక్ష్యపెట్టరు? అత్తయని కొంచెమైనను గౌరవములేదు. కాలిపై కాలు వేసుకొని విట్ల వీకుచున్నారు. "భయపడకుము" అని వేరే అంటారు. అవును లే. మగనికే భయపడనివారు నాకు భయపడెదరా? అంత భయమున్న నింత వెన్న మీగడ లోలోన పాడుచేయు చుంటిరా ?

పద్మ— మేమేమి పాడుచేయలేదు. అంత నీవు నీకొడుకే.

కమల — పద్మా! అత్తగారికి మర్యాద చేయవలెనంటు అట్లుచేసె దవే? నమ్మ మర్యాద చేయుదము. మహారాణిరాణి శ్రీ సౌభాగ్యవతి కుంకుమశోభితురాలైన అత్తగారు పెద్ద త్తగారు దయచేయుండి. పైనదయచేయండి ఇల్లు దయచేయం డి. పద్మా! అత్తగారువచ్చినారు. కుండక్రింద వేయుము. అత్త గారూ! కుండక్రింద వేయుదుమా? బానక్రింద వేయు దుమా!

రక్తాక్షి—నన్ను బానక్రిందవేయుదురా? మిమ్ము నేవేసెదను పిడకల కుచ్చక్రింద. ఇంత కొవ్వా? ఇంత కుచేష్టయా? హాస్యమాడెదరా? (అని పద్మను కాలితో తన్నును)

కమల— } ఆహాహా! అత్తగారికాలికి దెబ్బతగిలెనేమో (అని చెరి
పద్మ— } యొక కాలిని బట్టుకొందురు. రక్తాక్షి క్రిందపడి లేచి యేడ్చుచు) "వరేచందా చచ్చితిరా" (అని నిష్క్రమించును.)

కమల— } (నవ్వుచు) ఇంక నాటిని బిలువనొల్లవమ్మ నేమో? కాని
పద్మ— } నాకు వచ్చిన దేమి నేయుదు? ఊరక యొక్కసారి చూచినను మాటాడ్డు నవ్వా, కునుంగ మొక్కుకొన్నది.

[ప్రవేశము—చందుడు.]

చంద—ఏమియేమి మా అమ్మగారు అఱచెను? నాయమ్మ మొఱ్ఱకేసి? ఏమిచేసితిరి?

కమల—మేమేమిచేసితిమి? నమ్ములనేకొట్టి తాముక్రిందపడియేడ్చుకొనుచుపోయెను.

చంద—అతయేనా? సరే. మా నల్లావు ఈనినది. జున్నుతినవలెనని నాకు బహుతరి. మీరెవ్వరైనను పాలుపిండి జున్నుచేసి యివ్వండి.

పద్మ—వెన్న, మీగడ చాలకపోయెనా? జున్ను వేరె కావలయునేమో?

చంద—"వెన్నేమి?" "మీగడేమి?" బాగుగ నున్నది. నాకే యోచనగానున్నది. వెన్న మీగడ యెవరుదొంగలించేది తెలియుచున్నది. వారన్నమే పోదే. మీరుపుణ్యాను పాలుపిండండి.

కమల—నల్లావా? సరే. ముందుపోయిన పొడుచుచున్నది. వెనుక పోయిన తన్నుచున్నది. మీతల్లితో చెప్పుము. పాలుపింపుమన్ని, మేము జున్నుకాచెదము.

[ప్రక్కన రక్తాక్షి-ఒకప్రక్కన వీరికగుపడక నిలుచుకొని వీరిమాటల వినుచుండును.]

పద్మ—అవును. తన్నిన మీతల్లి నేతన్నసీ.

రక్తాక్షి—నన్ను తన్నవలెనా ? ఇంతకొవ్వా ? (అని పద్మను కాలితో తన్నును.)

కమ—
పద్మ— } ఓహోహో ! అత్తగారికాలునొచ్చెనేమో. (అని రక్తాక్షి దగ్గరకు పోఁబోవ )

రక్తాక్షి—నాకాలిదగ్గరవచ్చిన మీ మొముకలు విరుగఁగొట్టెదను. కాలుకట్టి పడవేయఁజూచెదరా ? (చందునిచూచి) గాడిద ! విధవ ! చేతకాని ముండ. నీవుండియు నన్ను దూషించుచుండ నూరకున్నావా ?

(అనుబంధము 35)

చంద—(అందరిని సమాధానపరిచి) అమ్మా ! నీదేమియాక్షేపణ ? ఏమిసంగతిచెప్పుము?

రక్తాక్షి—ఏమిచెప్పునది సీతల ? ఇంటిలోని వెన్న మీగడ అంతయు వీరిద్దరు దొంగలించి, తిని, అమ్మకొనుచుండ నీతో నేమి చెప్పునది ? నేనైనను మగవాఁడైయుండిన వీరిపని చేయుచుంటిని.

పద్మ—అదిగో ? మరల నీనోరేనా ? ఊరకకూచుండుము. నీకొడుకే అంతయు తినిపాడుచేయునది. ఊరకమాచుట్టు కొట్టుకొనుచున్నావు.

కమల—అవునవును. నీకొడుకు తిండి మాగోడు పెట్టుకొనుచున్నావు.

చంద—ఇదేమి నాప్రాణముపై వచ్చెనే ?

రక్తాక్షి—(చందుని పట్టుకొని) నిజము చెప్పుము. ఎవరు దొంగిలించినది?

చంద—అయ్యో గ్రహచారమా. ఇదేమి. నాకేమియు దెలియదమ్మా.

కమల—లేకపోయిన నీమూడు నెలలో నింత గుండ్రముగ బలియు చుంటివేమో?

పద్మ—లేకపోయిన నింత నున్న గుంటుంటివేమో?

చంద—అయ్యో! నాకన్నమే లేక దిగిపోవుచున్నానే?

రక్తాక్షి—వారనిన నేమి నాయనా! దృష్టితీసెదరులెమ్మా. అయ్యో! కొడుకా! యెంతదిగిపోతివి? నీదృష్టి తగిలెకాబోలు.

కమల—అవునవును. మాదృష్టియే. గొంతులో నొకచిప్పకట్టుము.

పద్మ—గవ్వలు జీడి కట్టుము.

రక్తాక్షి—చాలులే మీహాస్యము. మీకొడుకైయుండిన—

చంద—ఛీ. ఛీ. అట్లనకుము. అమ్మా! నాకొక యుక్తితోచుచున్నది. అట్లుచేసిన నిక్కము బయలుపడును. మనమందరము నేడొక కేచోటునపండుకొందము. ఎవరినోటికి వెన్నమీగడ గుర్తులుంటున్నవో వారు తినినట్లు. చేతికి గుర్తులుండిన వారెవరో యిచ్చినట్లు.

రక్తాక్షి—ఇది బాగుగనున్నది. (అని అందరు నిద్రింతురు.)

[ప్రవేశము—శ్రీకృష్ణుడు పాడుచు]

(అనుబంధము 36.)

(ఇంటిలోని వెన్నంతయు తిని రక్తాక్షి నోటికి చేతికి పూసి వెళ్ళిపోవును. తరువాత నొకరొకరుగా లేచి చూచు కొందురు. కమల పద్మ ముసలి దానిని దూషించెదరు.)

కమల—(రక్తాక్షికొక యద్దముచూపును) అబ్బ! ఇప్పుడు దొంగ దొంగ. లోలోననే తిని మా చుట్టు మొత్తుకొనుచుండును.

పద్మ—తనమీదితప్పు బయలుపడకుండ ముందుముందే మాపై వేసి తాను తప్పించుకొనుటకు చేసినయుక్తి.

రక్తాక్షి—(చెయ్యిచూచుకొని యాశ్చర్యపడుచుండును.)

చంద—నామీఁదేమో తప్పను.

రక్తాక్షి—(యోచించి) ఇప్పుడు తెలిసెను. మీరందఱు నేకమై మంచి నిద్రపట్టినప్పుడు నాకంటెంచితిరా? ఇంతమోసమా? చందా నీవుకూడ వీరికి లోనైతివి కదరా? అవునులే. భార్యలే యెక్కువగాని—

చంద—అమ్మా! నీపాదములంటిచెప్పెదను; నాకేమియు తెలియదు. నాకు మంచి నిద్రపట్టియుండెను.

రక్తాక్షి—అట్లైన నిదియంతయు వీ ద్దరిపనియా? కానిమ్మా. ఇంకను పొద్దున్నది కదా; ఇప్పుడు చేసెదరు వీరిపని.

కమల—పద్మా! ఇంకమనకంటించునేమో. మనము బహుజాగ్రత్తగా నుండవలెను. కన్నుమూసుకొని నిద్రపోయినట్లు చేయుదము. మనదగ్గరకు వచ్చినతోడనే పట్టుకొందుము.

పద్మ—అవును. అట్లనే చేయుదము. నీకు నిద్రవచ్చిన నాకుఁ జెప్పుము. నాకు నిద్రవచ్చిన నీకు చెప్పెదను.

చంద—చూచెద నీరాత్రి యేమేమి వింత జరుగగలదో, బహు జాగ్రత్తతో నిద్రచేయువాఁడవలెనుండి యంతయుఁ దెలిసికొందును. (మరల నందరుపండుకొందురు చంద్రుఁడు మాత్రమెంత ప్రయత్నించినను తాళఁజాలక నిక్కముగా నిద్రచేయును.)

[ప్ర—శ్రీకృష్ణుఁడు-కుండలో వెన్నతీసి చందరునోటిలో పెట్టును.]

చంద—(వెన్నను మ్రింగుచు, నిద్రలో కలవరించును. (నాకంటియు తెలియను లెమ్మా. ఊఁ ఊఁ. ఇంకేంలె; ఇంకేంత.

కమల— } (కన్నులు తెరచిచూచి యాశ్చర్యపడెదరు.)
పద్మ— }

చంద—ఇంకింత; నాకు తెలియును; యింకింత.

కమల—
పద్మ— } (గట్టిగా నవ్వుదురు)

(కృష్ణుడు పరుగెత్తిపోవును. అందరు నతని వెంబడించెదరు. చంద్రుడతనిని బట్టుకొనివచ్చి యొక్క పెట్టెలో వేసి పెట్టెపై తాను కూర్చుండును.)

కమల—(రహస్యముగా) ఇప్పుడైనను తెలిసెనా యువకుదొంగతనము చేయునది? నీనోటికి వెన్నవంటి చిన్నది సహితము మేమే యుంటివే?

చంద—నేను మరాత్రియు నిద్రించియుండిన నాపైవచ్చుచుండె నేమో?

పద్మ—అవును; చాలా మేలుకొని యుంటివి. నిద్రలోననే కుండ నిండ వెన్న మింగితివి.

చంద—పొమ్మా. యశోదను పిలుచుకొనిరమ్మా.

(పద్మపోయి యశోదను పిలుచుకొని వచ్చును.)

రామా! యశోదమ్మా! నీకొడుకు ప్రతిదినము మాయింటికి వచ్చి వెన్న, పాలు, దొంగిలించుచుండెను; ఈనాడు పట్టి పెట్టెలో వేసియున్నాను.

యశోద—నాకుమారుడనా? మాకృష్ణునినా? కల్ల.

చంద—మీకృష్ణునినే. మీచిన్నిదొంగకృష్ణునే. ఏమి? వాడెక్కడ?

యశోద—ఇంటిలో నున్నాడు?

చంద—ఇంటిలో నెక్కడనున్నాడు? ఈపెట్టెలో నున్నాడు.

యశోద—పిలతునా? (అని "కృష్ణా" "కృష్ణా" అని యరచును. ఒకమూలనుండి శ్రీకృష్ణుడు పరుగెత్తివచ్చును. అందరును ఆశ్చర్యముతో చూచుచుందురు.) (యవనిక పడును.)

## తృతీయాంకము—చతుర్థరంగము.

### నందుని గృహము.

### సీసమాలిక.

యశోద—నడయాఁడనేరని బుడుతవంచన నెట్లు నరుదుగాఁ నింటింట తిరిగితయ్య ?

శ్రీకృష్ణ—కరపాదములు లేక కావింతు చరియింతు నదియేమి యాశ్చర్యమా యెనమ్మా ?

యశోద—చనుబాలు త్రావఁగ చాలవీవింటింట పాలెట్లు హరియింపఁ బరగితయ్య ?

శ్రీకృష్ణ—హరియింతు బ్రహ్మాండమట నేను క్షీరము ల్హరియించు టదియెంత యరుదటమ్మా ?

యశోద—ఎఱుఁగ వేయాటలు యిలఁ బాసి యెఱుఁగవు నెటియాటలెట్లాడ నేర్చితన్న ?

శ్రీకృష్ణ—ఆటాడ నేర్తునే నాడింప నేర్తును నాయాటలెఱుఁగ నీకపు నెతల్లి ?

యశోద—పెఱవారు తిలకింప వెఱపొందకనీవెట్లు చోరుఁడై పొరుగిండ్ల దూరితన్న ?

శ్రీకృష్ణ—మునులకు చోరుఁడై, ఘనులకు చోరుఁడై యొరులకు నే చిక్కకుందునమ్మ.

యశోద- తే. గీ. దుండగంబులు చాలాయె నుండనోప
నిన్ను బంధింతు దండింతు నన్నయిక

శ్రీకృష్ణ— ఏమియెఱుఁగను యేపాపమెఱుఁగనమ్మ
కరుణగనుమమ్మ మాయమ్మ నరయుమమ్మ.

యశోద—తుంటరికృష్ణా ! నీతుంటరితనము నావద్దచెల్లునా ? ఎక్కడికిఁబోయియుంటివిరా యింతసేపు ? ఇంటిలో నేడు పండుగయై

యుండ తిరిగితిరిగి యిప్పుడిల్లుచేరితివియా? ఈదినము నీపం డుగచేసెదను. చెప్పుము.

(అనుబంధము 37.)

శ్రీకృష్ణ — అమ్మా! నేనెక్కడికినిఁబోవలేదు. ఇంటిలోననే యుంటి ని. మరి —

యశోద — మరి-గిరి. నీదొంగచేష్టలు నాకుఁదెలియును. మహామోస గాడవు. మొన్నపుట్టి యీదినము కండ్లుతెరచి యెక్కడ నేర్చు కొంటివిరా?

శ్రీకృష్ణ — నామాటవినవే? నామాట సాంతముగావిని నీకే కరుణ గలిగిన విడువుము లేకున్న నీవువలసినట్లొనర్పుము. మన రాముఁడు, గోపాలుఁడు, ఉద్ధవుఁడు నన్నాడుటకు రమ్మని పిలి చిరి. "నేను రాను. మాయమ్మకొట్టును. మీరుపొండి" అని చెప్పితిని. పండుకొంటిని. లేచిచూతుఁగదా వారు నన్నాతో టలో నాడించుచుండిరి. ఇందు నాదేమితప్పు నీవే చెప్పుము?

యశోద — (చిఱునగవుచిప్పి) ధూర్తగోపాలా! కాదు, నీవు పరుండిన వాఁడ వెట్లాటలాడితివిరా?

శ్రీకృష్ణ — అమ్మా! నాసంగతి నీకు బాగుగా తెలియదుగాఁబోలు. నే ను పండుకొనినచోటుచుండియే యన్నియాటలాడెదను. అందఱి ని నాడించెదను. నీయట్టివారడిగిన నాకేమియుఁ దెలియదని యూరకుండెదను.

యశోద — అయ్యో! నాచిన్నికృష్ణా! ఇంతయీడునకే యెంత నేర్చితి వయ్యా! (అని చేతిలోనికత్తెను పారవైచి ముద్దాడును)

[ప్రవేశము — ఒకబాలకుఁడు.]

బాలక — అమ్మా! యశోదాదేవి! (కృష్ణునిఁజూచి రహస్యముగ) చెప్పుదునా?

శ్రీకృష్ణ—(వద్దని సైగఁ జేయును)

బాలక—నీకుమారుఁడు మన్నుఁదినియున్నాఁడు. వలదని మేమెంత చెప్పినను వినలేదు. భూమికిని వీనికిని మిక్కిలి ప్రేమయున్నట్లున్నది.

(నిష్క్రమణము)

యశోద—ఓ నాకృష్ణా? తినుటకు నింటియందు పిండివంటలు లేవా? ద్రాక్షాదిఫలములు లేవా? ఇంత నేమితక్కువైనదని మన్నుఁ దినెదవురా? "అంగడిలో అష్టభాగ్యము, అల్లునినోట శని" యన్నట్లున్నదే నీచర్య?

క. మన్నేటికి భక్షించెదు, కన్నా
యనుచును లేల నీవు నమ్మింపవు నీ
యన్నయు సఖులును జెప్పెదర
న్నా మన్నేల మరి పదార్థము లేదే

శ్రీకృష్ణ—అమ్మా! వీరిమాటలా నీవు నమ్మునది? అబ్బబ్బబ్బ! యెంత కల్లలాడుచున్నారు! భూమి నాకు ప్రియురాలు నిజమే. మన్నుఁ దినునంతటి వెఱ్ఱివాఁడనా నేను?

శా. అమ్మా! మన్నుఁ దినంగ నే శిశువునో యాఁకొంటినో వెఱ్ఱినో
నమ్మం జూడకు వీరిమాటలు మది న్నన్నీవు గొట్టంగ వీ
రి మ్మార్గంబు ఘటించి చెప్పెదరు కాదేని న్మదీయాస్యరం
ధ్ర మ్మాఘ్రాణము జేసి నావచనము ల్తప్పైన దండింపవే?

యశోద—అయిన వీరిమాట లసత్యములా?

శ్రీకృష్ణ—అసత్యములా? ఇంకను అసత్యములా? అమ్మా! వీరితో నే నాడుటకుఁ బోవలేదు. కావున నిట్లు చెప్పుచున్నారు.

(అనుబంధము 3వ)

యశోద—అయిన నీనోరు చూపుము.

శ్రీకృష్ణ—(నోరు తెరచుచు. విశ్వరూప మగుపడును.)

యశోద—(దిగ్భ్రమము నభినయించి) ఆహా! యి దేమి చిత్తభ్రాంతి యో లేక మనోవికారమో ?

మ. కలయో మోహ మొకొ యయో యితరసంకల్పార్థమో సత్యమో
తలపక్న్నరక యున్నదాననొ యశోదాదేవిగానో పర
స్థలమో బాలకుఁ డంత యాతనిముఖస్థంబై మహాలోక ము
జ్జ్వలమై యుండుట కేమి హేతువొ మహాశ్చర్యంబు చింతింపగన్.

పరమయోగులకైనను జ్ఞానులకైనను జూడ నసాధ్యమైన రూపమునుఁ గాంచితినే? బాలుఁడు; ఏమియుఁ దెలియనివాఁడు. ఇట్టికృష్ణుని ముఖమునం దీబ్రహ్మాండజాలంబుఁ గనుపించుటా యెగా? ఆహా! ఇది వైష్ణవమాయయో, నాపూర్వసుకృతఫలమో తెలియకున్నది. (బాలునిఁజూచి) కృష్ణా! ఏమి నీమహిమ ?

శ్రీకృష్ణ — ఏమున్నదమ్మా? నీవేకండ్లు మూసికొంటివి; తెరచితివి.

యశోద—అవును కృష్ణా! నీవు మిక్కిలి సుశీలుఁడవు. ఇదిగో నాకు కొంచెము పనియున్నది. పోయివచ్చెదను. నీవిచ్చటనే కూర్చొనియుండుము. ఎక్కడికినిఁ బోవలదు ఎక్కడికైననుఁ బోతివా నిన్ను బాగుగ శిక్షించెదను.

శ్రీకృష్ణ—నేనెక్కడికినిఁ బోవనమ్మా. నే నెక్కడికినిఁ బోవకున్నను వన్నియు నావద్దకేవచ్చిన నెట్లు?

యశోద—వలదని యావల బంపుము. హెచ్చరిక.

(నిష్క్రమించును.)

శ్రీకృష్ణ—ఈతల్లికి నేను చేయు బాలక్రీడలచేత మన మానందపరవశమైయున్నను నొక్కపరి నేనొనర్చు పరమాద్భుతకార్యముల వలన నన్నే దైవముని భావించుచున్నది. కావున నామాయచే నామెజ్ఞానమును నశింపఁజేసి నన్ను పుత్రుఁడవనియే భావించునట్లు చేసెద. ఆమె మనమున కొక నిర్ధారణ కలుగకుండ చేసెద

ను. (నలుదిక్కులంజూచి) ఎవ్వరును లేరు ఇచ్చట నొక క్షీర భాండమున్నది. దీనిలో నిపాలను మనసారదాగివెదను. (అని కొంతదాగి భాండమునకు రంధ్రముజేచి పరుగెత్తును)

[పునః ప్రవేశము — యశోద.]

యశోద— ఔరా! ఏమి నాభాగ్యము? హరబ్రహ్మాదులు సైత మెవ్వనిపాదరజంబును నొందనేరక యనవరతము వేకరుచుందురో, యనేకశతసంవత్సరములు వాయునిరోధమునుం జేసి పాదాంగుష్ఠము భూమిపైనిలిపి తపమొనర్చు నిరతతాపసులైన నెవ్వని సాక్షాత్కారమొందనేరక కష్టించుచుందురో, వ్రతనియమాదులొనర్చిన పరమకర్మయోగులైన నెవ్వని సన్నిధానమునుం గాననేరరో, సన్నిహితయై, సహచారిణియైయున్న నా రమాదేవి యెవ్వనియాశయమెఱుంగకుండునో, యట్టి శ్రీరమాపతి, నారాయణుండు నాకొంతయుం గుమారుండై, నాయంక పాళికయనించి తనమాటలవలన నన్నుం గృతార్థురాలినిగా జేయుట నాతొలిజన్మమునం జేసిన తపఃఫలమేగదా? అదేమి మాయయోకాని యెంతవారైదఱు మహానీయులు నీకుమారుండు దేవదేవుండని బోధించినను పుత్రవాత్సల్యమే కలుగుచున్నదిగాని భక్తిరస ముద్భవింప కున్నది. కానిమ్ము భక్తివిశేషమున ధ్యానించుట లేకున్నను నాపరాత్పరుని దర్శనస్పర్శన సల్లాపాదులచేనైన నాకు ధన్యత కలుగకపోవునా? (అందిందుచూచి) ఆహా! మాచోర గోపాలుండెక్కడికో పోయియున్నవాండే? నన్ను కనుమరిగించి యెక్కడికింబోయియుండును? ఎంతకాచెదనన్ననూ మాగోపాలకృష్ణుండు నన్నే మోసగించుచున్నవాండే! ఇప్పటినుండియే యిన్ని టక్కులు యిన్ని మోసములు నేర్చిన ముందెట్లగును? ఇంక వీనిని దండిం

కకున్న విధిలేదు (కొంచెమాలోచించి) ఆహా! యెట్లు దండింతును? నింకుతుమ్మెదల బారి విరసించు ముంగురులు నిటల ప్రాంతమున నటియింప, శారదచంద్ర చంద్రికావిశద మనోహర మందహాస మధరబింబమున కొక వింత కాంతినివ్వ, ముల్లోకంబులఁ గొనఁజాలు వెలలేని తెలిదామరలవలపు సొంపుల వెలి వేయు వీక్షించిన నానంద మోక్షరాజ్య మొసంగు పుండరీకాక్షుల పరపుండరీకాక్షుమహిమము నుగ్గడింప, పున్నమ చందురు విన్నాణము వెన్నుదన్ను వెలలేనిచెలువునించు మోముఁ దిలకించినవారి ధన్యులఁ జేయుచుండ, పదునాల్గులోకంబులనైనఁ భరియింపఁజాలు తిన్ననిబొజ్జ కదలాడుచుండ, ప్రత్యవయవంబులనుండి పొంగి, పొరలి, పైనుబుకు లావణ్యసుధారసంబు కన్నులకొక పరమాద్భుతంబునించు మారాజగోపాలు మణిదర్పణ కపోలు, సుగుణాలవాలు, అష్టమీచంద్రవిభ్రాజ దసముఫాలు, నాముద్దులబాలు నా చేతులార శిక్షింపఁజాలుదునా! (యోచించి) అయ్యో! శిక్షింపకున్న నెట్లు? లాలనము చేయుటవలన ననేక దుర్గుణము లావరించును; శిక్షించిన ననేక సుగుణము లావరించునని గదా లోకానుభవము? ఏమిచేయుదమన్నను చేతులాడవుగదా దుష్టచేష్టల నాలించి శిక్షింపవలయునని మనమున నెంతయో నిర్ధారపరచుకొని పోవుదును గాని, దగ్గరకువచ్చి మా వేణుగోపాలుఁ డమ్మా యని చేతులెత్తి, యేమియుఁ దెలియని రీతి ముఖము వంచి, నేత్రములనుండి చిన్నిచిన్ని కన్నీటిబిందువుల విడిచినా ఉన్నకోపమంతయుఁ బోయి యెక్కడలేని ప్రేమయు వెలివచ్చి నాదేహమునే మఱపించును. (క్షీరభాండమునుఁ జూచి) ఆహా! ఇప్పటవున్న పాలన్నియు త్రాగిపోయి యున్నవాఁడే?

ఎట్లయిననూ నేను దొరికినా వానిశిక్షింపక మానను. కృష్ణా! కృష్ణా! (నిష్క్రమును.)

[వెనుక యవనికనెత్తఁగా శ్రీకృష్ణుఁడు పరుగెత్తుచుండును. యశోద వానిని వెంబడించుచు.]

(అనుబంధము 39)

యశోద—(కృష్ణునిఁ బట్టుకొని) చోరగోపాలా! ఇంక నిన్ను విడువను. పసిబాలుఁడవని పోవనిచ్చినట్లంతయు నీపోకలు మానవుగదా? ఈగోకులంబుననున్న బాలకులందఱు నెట్టిసుస్వభావులై యున్నవారు చూడుము. నీవెక్కడనో విలక్షణ పుత్రుఁడవు జనించితివి నాకు. నిన్ను నేఁడు విడువను. నీవెవ్వరియందునఁ జిక్కుపడవు. ఎవ్వరికిని భయపడవు. నేఁను చూచెద నీచేష్టలన్నియు.

శ్రీకృష్ణ—(కన్నులు పులుము కొనుచు) జననీ! ఇంక నేనెన్నఁడును తప్పులు చేయను. ఈసారిమాత్రము నన్ను మన్నింపుము. నేనిదివఱకు నొకరినిమన్నించి యెఱుగుదును గాని మన్నింపుమని వేఁడి యెఱుఁగను.

యశోద—ఓరా! వెన్నకృష్ణా! దొంగతనమున వెన్ననంతయుఁ దినునప్పు డీవినయ మెక్కడికిఁబోయి యుండెను? వెన్ననంతయు భక్షించి పరుగెత్తితివా?

శ్రీకృష్ణ—అమ్మా! నేను వెన్నను భుజింప లేదు. నీవు లోపలపోతివి. నేను కుండ బాగుగనున్నదా యని దానినిఁ దాఁకితిని. కుండ రెండు భాగములై యేటికో క్రిందపడెను. అప్పుడు నేనుదానికై వెఱగంది నీవు వచ్చిచూచిన నేమందువో యని కన్నులు మూసికొని యాలోచించుచుంటిని. బాలురందఱువచ్చి నా నోటిలో వెన్నవిడిరి. మాయమ్మ తిట్టును, వలదని నేనెంతచె

ప్పినను వినక మీగల్లి మే నిన్ను భక్షింపుమని చెప్పినది భుజిం పుమని కడుసిక్కచ్చి చేసిరి. నేను మింగితిని. మింగుట మాత్రము వాదితప్పు.

యశోద—ఔరా బాలకా! యెన్నివిన్నాణములు నేర్చియున్నావు? ఆవెన్నను దెచ్చియిచ్చినగాని నిన్నువిడువను. లేనిచో నా వెన్నుఁడు పచ్చినను విడువను.

శ్రీకృష్ణ—జననీ! ఆనవనీతము కడుదుర్లభమే? అనుభవించినవారికి మాత్రము సులభము. ధనికులకు మిక్కిలి కష్టము. (అని యామెనుండి తప్పించుకొని దూరముపోయి నిలుచును.

యశోద—వీనిమాటలకు నవ్వుదునా లేక కోపగింతునా? ఏమో బాలుఁడని మన్నించితినా తుంటరిపనులఁ జేయును. దం డింతునంటినా మనసుపుట్టదు. ఏమిచేయుదు ?

సీ. బాలుఁ డీతండని భావింతునందునా

యేపెద్దలును నేర దీక్రియంబు?

భయమెఱుంగుటకునై భయపెట్టనెంతునా

కలిగి లేకొక్కడు గాసి లేదు

దండించి జ్ఞానంబుఁ దాల్పింతునందునా

తనుదాన యెబుద్ధి దప్పకుండు

ఏమెఱుఁగక యింటనే యుండునందునా

చొచ్చి చూడనిదొక్క చోటులేదు

గీ. తన్ను నెవ్వరైనఁ దలపోయఁ బారెడు

నోజలేదు భీతి యొకటెఱుఁగఁడు

ఎలిమినూరకుండఁ డెకసెక్కములనాడు

పట్టి శాస్తిసేయు భంగి యెట్లు.

(అని బాలుని వెంబడించి వానినిఁ పట్టుకొని)

యశోద—ఓహో! నీవు శ్రీకృష్ణుఁడవో?

కం. వీరెవ్వరు శ్రీకృష్ణులు
గారా యెన్నఁడును వెన్న కానరటగదా
చోరత్వంబించుకయును
నేరరఁట ధరిత్రి నిట్టి నియతులు గలరే?

కృష్ణా! చిక్కితివి. ఇం కెందు పోవఁగలవు? యెక్కడను మాదినను ది రుగుచుందువు. ఏగుణము నీయందు లేదు! నీళ్ళని వెఱవవు. కొండయని భయపడవు.

క. ఎక్కడనైనను దిరిగెద
వొక్కయెడన్ గుణముఁ గలిగియుండవు నియమం
బెక్కడిది నీకు మఱదినఁ
జక్కఁగ బోయెదవు పెక్కుజాడలఁ బుత్రా.

(స్వగతము) ఈముద్దుబాలునిఁ గొట్టుటకు మనసురాదు. కావునఁ గట్టి వైచెదను. (తాడు తెచ్చి కట్టుటకై యెన్నిమారులు బొజ్జకు చుట్టిన నది చాలకపోవుటఁ జూచి) ఆహా! ఇది యేమిచిత్రము? ఈకుమారుని చిఱుతబొజ్జ కెంతపెద్దత్రాడు చుట్టినను జాలక యున్నదిగదా? ఈబొజ్జ లోకమున నెందునుఁ గాంచని బొజ్జ గానున్నదే? కృష్ణా! కృష్ణా! కట్టుపడెదవా? లేదా?

శ్రీకృష్ణ—జననీ! నేను కట్టుపడవలయునా? నన్ను సులభముగా కట్టి వేయుమార్గము లనేకములున్నవి. నీవు పుత్రుఁడవని యింత ప్రేమించి యడిగిన నీకునుఁ గొంతకట్టుపడెదను.

యశోద—(బాలుని రోటికిఁ గట్టి) ఇంకెక్కడపోవఁగలవు? పడియుం డుమిందు. (నిష్క్రమించును.)

శ్రీకృష్ణ—లోకమున నన్నుఁ గట్టివేయఁజాలు భక్తియొక్కటియున్న నేను సులభముగాఁ గట్టుపడెదను. అయినను నీబంధనము

వలన నాకై వేచియున్న నాభక్తుల బాధనముల విడిపించెద గాక. (అని రోటి నీడ్చుకొనుచు రెండర్జునవృక్షముల నడుమ పోవును. గొప్ప ధ్వనితో నావృక్షములు కూలి వానినుండి నలకూబరమణిగ్రీవు లను నిరువురు గంధర్వులు వెడలివచ్చి కృష్ణుని స్తోత్రముఁ జేయుదురు.)

(అనుబంధము 40)

నల—దేవా! కృతార్థులమైతిమి. నీదయావలోకనమున మాకు శాపవిముక్తి గలిగెను. నేను నలకూబరుఁడను వాఁడను. ఇతఁడు మణిగ్రీవుఁడనువాఁడు, నాతమ్ముఁడు. మే మిరువురము కుబేరుని నందనులము. ఒకనాఁడు కాంతలతోఁగూడి యాకాశగంగయందు జలక్రీడలు సల్పుచుండ నారదమహామునీంద్రుఁడచ్చోటికివచ్చి తన్ను సరకుసేయక యున్న మమ్ము భూలోకమున నర్జునతరువులై పుట్టుఁడని శపించెను. ఆశాపమువలన మేమింతవఱకు బంధమోక్షముఁ గానకయుంటిమి. నీవల్ల మోక్షము నొందితిమి.

మణి—మేము తెలివిఁదెచ్చుకొని యాతపోధనుని పాదములపైఁబడి మన్నింప వేడికొన నాపరమదయాళువు ద్వాపరయుగమున విష్ణుమూర్తి కృష్ణావతారమెత్తి మిమ్ముల బడవైచును. అప్పుడు మీకు శాపవిముక్తి గలుగునని ఆనతిచ్చె. మే మింక పోయివచ్చెదము. (అని నమస్కరింతురు.)

శ్రీకృష్ణ—గంధర్వులారా! మీకు శుభంబగుఁగాక. పోయిరండు. ఎప్పుడును ధనమదాంధులై పూజ్యులగువారి నవమానింపకుఁడు. తెలివిఁదెచ్చుకొనిమనుఁడు.

(నిష్క్రమము.)

శ్రీ

# కృష్ణలీల నాటకము.

## చతుర్థాంకము—ప్రథమరంగము.

బృందావన సమీపారణ్యము.

[ప్రవేశము—శ్రీకృష్ణుడు పాడుచు]

(అనుబంధము. 41)

శ్రీకృష్ణ—చంద్రోదయ మగుచు వచ్చె. అల్లదే చంద్రుఁడు పూర్వాద్రిపై వెలుఁగొందుచున్నవాఁడు. ఆహా! చకోరములకు సంతసముఁ గలిగించి కువలయంబులకును కువలయమునకును పురుఁడుతేని యాహ్లాదరసము నించు యీచంద్రుఁ డెంతయొప్పుచున్నవాఁడు ?

సీ. విటసేనయయి దండు వెడలెడు వలతేని
కొమరారు రథహేతు కుంభ మనఁగ
కాముకధృతివల్లికలఁ ద్రెంపనెత్తిన
శంబరాంతకుచేతి చక్ర మనఁగ
మారుండు విరహాలి మానాటవులఁ గాల్పఁ
గూర్చిన నిప్పుల కుప్ప యనఁగ
విరహిణీమృగముల వేటాడ మదనుండు
తెచ్చిన మోహన దీప మనఁగ

ఆ. వె. వింతనునుపుగలిగి, వృత్తమై, యరుణమై
కాంతితోఁ జకోరగణము లుబ్బ
పొడమె నుదయాద్రిపై సొంపు పొడమఁ జంద్ర
మండలంబు గగనమండలమున.

ఇట్టి చల్లనివేళ వీనులకు విందుగ వేణుగానం బొనర్చెదగాక. (అని మురళీగానము చేయును )

(లోపలపాట. 42-వ అనుబంధములోని పల్లవి మాత్రము )

అల్లదే గోపకాంతలు వచ్చుచున్నట్లున్నది. వీరికిఁ గొంచె ముపదేశింప వలసియున్నది. మరుగుననుండి వీరిచర్యలఁ దిలకించి వీరి పూర్వజన్మజ్ఞానమునఁ దెలివిని కలుగునట్లు చేసెదను.

(అని మఱుగున డాఁగికొనును.)

[ప్రవేశము—గోపికలు పాడుచు]

(అనుబంధము 42)

1 గోపిక—ఆహా! మనమెంత మోసపోతిమి? యశోదగారాబుతనయుఁడంచును, గోపాలబాలుండనుచును, నవనీతచోరుఁడనుచును, తుంటరి కృష్ణుండనుచును నెంచి, మక్కువలునించి, మొనలేని మోహముఁ గురించి, యశోదాదేవికొడ నారాజగోపాలుని దుడుకుతనంబుల వచించి బేలలమైతిమి గదా? ఈబృందావనమున నాబృందారకమూర్తి, సనకసనందనాది వందితుఁడు, ముకుందుఁడు, నందనందనుఁడు, మనలనుఁ గృతార్థులఁ జేయుటకై భూలోకమునకు విచ్చేసియుండుటను తెలియఁజాలక పోయితిమే?

2 గోపిక—అమ్మా! మన యశోదాదేవిదే భాగ్యము. పురాణపురుషుఁడగు నాకృష్ణమూర్తి నందనుఁడై జనింపఁ గలుగుటవలన నామె తపఃఫలమెంత కొనియాడ వలసియున్నది?

3 గోపిక—అయ్యో! ఇంతదూరము వచ్చియు మన మనోరథములీడేఱవయ్యెఁగదా? మనకేల యట్టిప్రాప్తి లభించును? వేదములకైనఁ దొరకక, తపోమార్గమునకుఁ జిక్కక, యోగాభ్యా

నమునకుఁదక్కఁక, తనంత వెదకఁగొందు నాకరమాత్మ, పాప చిత్తులమైన మనకుఁ దర్శన మిచ్చునా?

1 గోపిక — ఓమల్లియలారా! మీ శ్రేష్ఠమైన మాకృష్ణునిఁ గాంచితిరా?

ఉ॥ నల్లనివాఁడు, పద్మనయనంబులవాఁడు, కృపారసంబుపైఁ
జల్లెడువాఁడు, మాళి పరిసర్పిత పింఛమువాఁడు నవ్వురా
జిల్లెడు మోమువాఁ డొకఁడు చెల్వలమానధనంబు తెచ్చెనో
మల్లియలార! మీపొదల మాటున లేఁడుగదమ్మ చెప్పరే.

4 గోపిక — ఓపాటలీ తరువులారా! మాకందములారా! మీరైన మా కృష్ణునిఁ జూపరాదా?

2 గోపిక — అయ్యో! ఈకాంతారమున నెంత వెదికిన నేమి? ఆకఠిన హృదయుఁడు మనకుఁ జిక్కునె? ఆధూర్తగోపాలునిచర్యలు మనమెఱుఁగమా? వాని కీర్తి మెత్తని మార్గములకుఁ గరుణవచ్చునా? మన దృఢభక్తియనెడి త్రాళ్ళచే బిగించి, మనమనస్సనెడి చెరసాలయందుంచి, వైరాగ్యమనెడి బేడీలు తగిలించినగదా మనకుఁ జిక్కును. లేకున్న వాఁడొంగ యనఁగనేమి? మనకు దొరకుటనఁగ నేమి? (అని కొంచెము ముందుకుఁ బోయి) ఆహా! అతనిపాదతలము లిందుకనుపించుచున్నవి. ఈచరణము లేకదా భవతరణములు?

సీ. ఈచరణంబులే యింపుని భావన
సనకాదిమునియోగ సరణినొప్పు;
ఈపాదతలములే మెలవాఁగ శ్రుతివధూ
సీమంతవీధులఁ జెన్నుమిగులు;
ఈపదాబ్జంబులే యిభకులోత్తమయాన
పాలేటిరాచూలి పట్టుకొమ్మ;

ఈసుందరాంఘ్రులే యి దివరేఖన
మోహితకాంతా మనోమోహనంబు;
ఆ. వె. లీయడుగులరజము యింతి బ్రహ్మేశాది
దివిజవరులు మౌళిదిశలదాల్తు
రమ్మలార యిట్టి యమలపదంబుల
గాంచు భాగ్యమింకఁ గలదొ లేదొ.
ఆహా! ఓధరిత్రీదేవి! యేమి పుణ్యముచేసితివియోగదా?
క. కిటియై కౌఁగిటఁ జేర్చెను
వటువై వర్ధిల్లఁ గొలిచె వరకృష్ణుండై
యిటు పదచిహ్నములిడె నేఁ
డటు బాముననేమి నోచితమ్మ ధరిత్రీ.
గోపిక — ఎట్లైన నాహరిని భక్తిమార్గముననే కట్టివేయవలయు.
కావున నాతనినింత ధ్యానింతము. అప్పు డతఁడే యిచ్చు రాఁ
గలఁడు.
(అని యందఱు కన్నుమూసికొని ధ్యానింతురు)
(అనుబంధము. 43)
[ప్రవేశము — శ్రీకృష్ణుఁడు.]
శ్రీకృష్ణ — గోపకాంతలారా! లెండు. ఏమి నేఁడు మీరందఱు మహా
మనులై యున్నారు?
గోపికలు — కృష్ణా! కృష్ణా! దొరకితివా! ఇంకెందుఁ బోగలవు?
(అనిచేతులను కొందఱు, పాదములను కొందఱు వస్త్రమునుఁ
గొందఱు పట్టుకొందురు.)
శ్రీకృష్ణ — వల్లవాంగనలారా! నిమ్మళింపుఁడు. కూరుచుండుఁడు. (అ
నఁగా నందఱు కృష్ణుని విడిచి దూరమున నిలుతురు. హరిణా
క్షులారా! మీకందఱకు సేమమా? మీయందఱు సౌఖ్య

మా ? ఇది సింహశార్దూలాది ఘోరమృగంబులు సంచరించెడి మహావనమే ? ఇటకు మీ రొంటిపాటునఁ గావచ్చునా ! అందును రాత్రికాలమున నబల లిలువిడిచి వచ్చుట మహాపరాధ మగునుకదా? ఇంతవఱకు మీతలిదండ్రు లెంత వేకరుచుందురో ? మీయన్నదమ్ము లెంత వెదకుచుందురో? బావమఱందు లెంత భయపడుచుందురో ? వారికి జెప్పియైనను వచ్చితిరా ?

శా. మేలా మీకు? భయంబు పుట్టదుగదా మీమదిన్? సింహశా
ర్దూలానేకపముఖ్యముల్ దిరిగెడిన్; దూరంబు లేదెంతురే?
యేలా వచ్చితి రీనిశాసమయమం దీరీతి రావచ్చునే ?
బాలల్ జాలు లతాంగులార చనుఁడీ సంప్రీతితో మందకున్.

1 గోపిక—ప్రాణవల్లభా ! మాయిండ్లవా రందఱకిని నేనుమే ఇచ్చటికి వచ్చుట యేలయని లోకారాధ్యుఁడవగు నీవే యడిగిన మేమేమి చెప్పఁగలవారము ? నీదివ్యశరీరసంస్పర్శనమువలనను, నీయనవరతక్రీడావినోదసుఖమువలనను, నీసురతసుఖము వలనను, నీ యభినవ సరససల్లాప సౌఖ్యమువలనను, నీయధరామృతపానమువలనను, ధన్యలగుటకునై నీమురళీగానము వినినంతనే పతుల మాటాడింపక, సుతుల నాదరింపక, బావమఱఁదుల నాశింపక, నీసన్నిధికి వచ్చియున్నారము. త్రాహియని శరణొందియున్నారము. ఈ విరహతాపమును సహింపఁజాలము.

శ్రీకృష్ణ—ఇందుముఖులారా ! ఇదియా ధర్మము ? ఇదియా కులాచారము? ఇదియా మీకును మాకును నాచరణీయము ? ఇన్ని దినములు నాసేవాభాగ్యము మీకు గలిగియుండియు జ్ఞానము లభింపదయ్యెగా ? అయ్యో ! బంధువుల కందఱకినిఁ

దలవంపులుగా జారిణులై జారభోగము నభిలషించి యిందు వత్తురే ?

చ. తలువరిసున్నఁ జేసి హృదయేశుల సిగ్గులఁ జంపి యుత్తమా
మల నెఱింకించి సోదరుల మానముపోవఁగఁ గొట్టి తల్లిదం
డ్రుల రుచిమాన్చి బంధులకు రోతయొనర్చుచు జారవాంఛఁ ద
వలతురె సత్కులాంగనలు వత్తురె లోకులుచూచి మెత్తురే.

అకటా ! జారిణీసంభోగమువలన నేమైన మీకు రుచికలదని యెంచితిరా ?

సీ పాతివ్రత్యముఁ జెఱచిన ప్రాణంబుపై వచ్చు
రాజెఱింగిన మనరామిగల్గు
మామ యెఱింగిన మమత యే చెడిపోవు
తలవరి యెఱిఁగినఁ దప్పుకల్గు
తలిదండ్రులెఱిఁగినఁ దలయెత్తకుందురు
వదినగా రెఱిఁగిన వాసిపోవు
ఆత్మజు లెఱిఁగిన నాదరింపకయుండ్రు
బంధువులెఱిఁగిన బవిసిచెడును

ఆ. వె. ఇతరు లెఱిఁగిరేని నింతయుఁ జులకగాఁ
జూతు రిందునందు సుఖము లేదు
యశము లేదు నిర్భయానందమును లేదు
జారతనము సుఖమె చానలార.

లేక మీరు పొరబాటున వచ్చితిరా ? ఇది యమునానదీతీరపల్లవిత రమ్యకాంతారముగాని వేపల్లెయుండలి మీ కటీరములు గావు. చక్కఁగ నాలోచింపుఁడు.

2 గోపిక — దేవా ! ఈ తుచ్ఛమగు దేహసౌఖ్యమునుఁ గోరి యిందు వచ్చితిమని యెంచితివా ? ఎంతపొరబడితివి ?

శ్రీకృష్ణ—అటులైన మీరువచించిన వాక్యములయందుఁగల "శరీర స్పర్శన"మనుపదమునకును, "కామబాధ" యను పదమునకును "నీవిరహాగ్నిని సహింపక" యనుపదమునకును "సురత" మను పదమునకును, "అధరామృత" మను పదమునకును భావమేమి ?

2 గోపిక—సర్వేశ్వరా ! శబ్దబ్రహ్మవై, సకల వాక్యజాలంబుల కర్థ స్వరూపుఁడవైయున్న నీవెఱుంగని యర్థమర్థముగలదే? అయినను మామనసరయుఁగోరి యడిగెదవుగాక. దివ్యశరీర స్పర్శనమనఁగా, వాచామగోచరమై, సచ్చిదానందగుణమగు నీతేజమునందు మేమను తేజమును లయమొనర్పుమని మా యభిప్రాయము. ఇఁక కామబాధయనఁగాఁ దుచ్ఛమగు మన్మథబాధయని మాతాత్పర్యము కాదు. కామక్రోధాది గుణములనెడి శత్రుబాధనుఁ దొలగించి మానసశుద్ధిఁగలిగించి, జ్ఞానమందియుండఁజేసి, మోక్షసుఖమిమ్మని మాయభిప్రాయము. మఱియు నీవిరహతాపమనఁగా జ్ఞానానందము యుండదగు నీయందవిద్యచే నారోపింపఁబడిన యజ్ఞానాసత్య దుఃఖములచేఁ గూడియుండు జీవత్వము నీవిరహమునఁ బ్రాపించిన దుఃఖము గావున నట్టివిరహమును వోవఁగొట్టి సచ్చిదానందమూర్తియగు నీయం దేకాకారముగ పరిణమింపఁ జేయుమని మాయభిప్రాయము. సురతమనగా నీయందు భక్తిమై క్రీడించుచు ప్రత్యగాత్మ పరమాత్మలనక భేదము కల్పింపుమని యాశయము. అధరామృతమన సర్వసుఖములను ధిక్కరించుచు మోక్షపద సుఖమిమ్మని నిన్ను వేడువారము.

3 గోపిక—లక్ష్మీరమణా! మే మనవరతము నీయందే దృష్టిఁగలిగి భవదృక్త్యాధీనమానసలమై, నిన్ను సేవించుటకై వాంఛించియు

న్నారము. మాకు నీభక్తియే మోక్షదాయకమని నమ్మియున్నారము. పతిపుత్రాదిసంసారము నింద్యమైనసంసారము. కావున ననన్యధాగతికలమముఁ జూచి మాకుఁ దరణోపాయమును వచించి కృతార్థులను చేయుమని వేఁడుచున్నారము.

శ్రీకృష్ణు—గోపికలారా! మీయాశయము మిక్కిలి సమంజసము. మీరు నన్ను సేవించుటకై, నావలన నధ్యాత్మవిద్యోపదేశము నొందుటకై జనించిన మహామునులుగాని నిక్కంపు గోపకామినులు కారు. కావుననే మీరిట్టిసుజ్ఞానమునుఁ బొందియున్నారు. అయినను నిట్టివేదాంతజ్ఞానమును కలిగియున్నను లోకమర్యాదను విడువఁబాడిగాదు. లోకమునఁ గొందఱు మూఢాత్ములు మనలనుఁజూచి సందేహింతురు. మఱియు నాయందు వ్యభిచారదోషము నారోపించి, నన్ను పరిపరినిందింతురు. వారు పరమార్థము నెఱుంగఁ జాలరు. నాయందు భక్తిభావనచే విశేషజ్ఞానమూనిన వారు కామినులైననేమి? కాముకులైననేమి? వారికి ముక్తి నొసంగుట నాకెంతయుఁ గర్తవ్యముకదా? కావున మీరును లోకవిదితులగాక, బాహ్యప్రపంచమున సంసారులవలె నటించుచు, నంతమందు నన్నుఁ ధ్యానించుచు జ్ఞానమవలంబింపుఁడు మీకు ముక్తికలుగును. ఇదియుఁగాక భామలకు పతికంటె వేఱొక్కదైవముకలదే? ఆపతినే నారూపునిగభావించి పతికి పరిచర్యలఁ జేయుచు నప్పుడప్పుడు నన్నుఁ దిలకించి జ్ఞానంబు నొందుచు కాలముఁ గడపి యంతమందు మోక్షము నొందుఁడు.

చ. పతితలు నన్నుఁగోరి యిటవచ్చితిరింత గొఱంతలేదు మే
లోనరె సమస్తజంతువులు నన్ ప్రియుంబులుగా నెఱుంగుచున్

నను గొలువంగఁ బోలను సనాతనధర్మము లాఁడువారికిన్
పెనిమిటులన్ భజించుటలు పెద్దలుచెప్పుచు నుందు రెల్లెడన్॥

క॥ నడవడి కొఱగాకున్నను
బడుగైనఁ గురూపియైనఁ, బామరుఁడైనన్
జడుఁడైన, రోగియైనను
విడువక పతిసేవఁ జేయ వెలఁదికిఁ దగదే॥

నాదర్శనధ్యానాకర్ణనములవలననే మీకు ముక్తి లభింపగలదు.

క॥ ధ్యానాకర్ణనదర్శన
గానంబుల నాతలంపు గలిగినఁ జాలున్
పూనెదరు కృతార్థత్వము
మానవతుల్ చనుఁడు మరలి మందిరములకున్॥

4 గోపిక—

మ॥ ఘనలక్ష్మీయుతమై, మహాశుభదమై కామాదివిధ్వంసియై
సనకాదిస్తుతమై నిరంతరతరస్వాంతస్థపున్నాగజీ !
వనమై యొప్పెడు నీకథామృతము ద్రావంగల్గు నభూరిదా
నవిమోఘత్వము లేనివారలకు మానారీమనోహారకా॥

చెలులారా! ఎంతు ధన్యులమైతిమి. ఈశరత్కాలపు వెన్నెలయం దీమాధవుని నింత యారాధింతము.

(అని జలనాట్యముఁ జేయుదురు.)

(మెల్లఁగ యవనిక పడును.)

---

చతుర్థాంకము—ద్వితీయరంగము.

మధురాపురి కంసునియాస్థానము.

[కంసుఁడు, మంత్రులు, అక్రూరుఁడు నుందురు.]

కంస—మంత్రులారా! ఇప్పుడున్నయుదంతమంతయుఁ దెలిసెను కదా? నాచేసినయుద్యమములన్నియు నిష్ఫలములయ్యె. మాయోపాయములన్నియు వమ్మయ్యె. అయిన నొక్కదానికై యూరట జెందవలసియున్నది. నాశాత్రవుఁ డెందో యవిదితనామధేయుఁడై, మదీయదృష్టిపథంబునఁబడక యిదివఱకుఁ దప్పించుకొని తిరుగుచుండె అట్టివాఁడిప్పుడు కట్టడి యాదవగోపాలుఁడని తెలియుట మిక్కిలి మాకు సహకారికదా? అందుకై నేను దీర్ఘాలోచన మొనరించి, యెట్లైనను వానినిటకు రప్పించునుపాయంబు వెదకి యిటకువచ్చినతోడనే వాని నస్మదీయ కృపాణధారచే నెనే ఖండింపఁదలఁచియున్నాను ఈయుపాయ మపాయమా, నిరపాయకరమా యనుట నాలోచించి మీమీ యభిప్రాయముల నొసఁగవలయు. లంబకర్ణా! నీవేమందువు?

లంబ—దేవా! సర్వజ్ఞులు మీకుఁ దెలియని విషయముగలదే? అయినను దేవరవారు నాయభిప్రాయమడుగుట నన్నుఁ గృతార్థునిఁ జేయఁదలచి కాని వేఱుకాదు. ఇప్పుడు మనమేల వానినిఁ బిలిపింపవలయు? మనకు శత్రువైనవాఁడు ద్వేషమవలంబించి దానిసాధించుటకై మనయొద్దకేవచ్చును. అప్పుడు వంటయింటి కుందేటినిఁ జేత నలిమిన ట్లవలీలగ వానిని దున్తింతము. దీనికై మనమేల ప్రయాసపడవలయు?

కంస—ఇదియునొకమార్గమే. తామ్రముఖా! నీయభిప్రాయమేమి?

తామ్ర—స్వామీ! నాయభిప్రాయమేమున్నది? ఊరకనన్నంపుడు. నేఁబోయి సమయము వేచి వానిని సంహరించి వచ్చెదను.

కంస—ఉండనిమ్ము. తాళభుజా! నీయాశయమేమి?

తాళ—దేవా! మనకేల యాలోచన? నిశ్శంకముగ రాజ్యమును పాలించుచుందము. బాలుఁడేమి; మనకు శత్రువనంగనేమి? వాఁడు మనకేమొగ్గొనర్చి యున్నాఁడు?

కంస—నీది ధీరమతము కాదు. కుంభనాసా! నీవేమందువు?

కుంభ—నాకుఁజూడ మనమై వానినిందు బిలిపించి చంపినను సరియే. లేక వాఁడేవచ్చిన తఱువాత సంహరించినను సరియే. మీ కేది సమాధానమో నాకు నదియే సమాధానము.

కంస—సమంజసము. అక్రూరా! నీవీ తొలిజామునఁ బయనమై బృందావనమున కరిగి, యిచ్చట నేనొక ధనుర్యాగమునుఁ జేయ నెంచి యున్నాననియు, నందులకై యాగోపాలుని నిందు రాఁ గోరితిననియుఁ జెప్పి వానినిఁ దోడ్కొనిరమ్ము.

అక్రూర—కంసరాజేంద్రా! కొంచెము దీర్ఘాలోచన మొనర్పుము. ఈ కార్యము మిక్కిలి ఘోరము. మహాపాపకరము. పాపకర మొక్కటియే కాదు. బంధుహింసాకరము. ఆగోపాలమూర్తి నీచే వధింపఁబడువాఁడు కాఁడు. అతఁ డాద్యంత శూన్యుఁడు. ఆదినారాయణుఁడు. భక్తిభావమున నతనిని శరణొందితివేని నిన్ను క్షమింపఁగలఁడు. అతనియెడ ద్వేషమూని యూరక నశింపకుము. ఈధనుర్యాగవ్యాజమున నీవతనినిఁబిలిపించినను దీనితత్త్వము నతఁ డెఱుఁగఁజాలఁడా? మృత్యువునుఁ జేరంటము నకుఁ బిలిచిన ట్లతని నేల యిందు పిలిపించెదవు? మానుము. ఈ దురాలోచనను వదలుము.

సీ. [illegible] కయుపహ్నకేలల
చెంబిల్చుదుబుద్ధి దూరుఁడవఁడు?

ప్రాణానిల గ్రాహ ప్రౌఢమృత్యువుఁగంట
వసియు పరమ్మను పందయెవఁడు?
గిరిగహ్వరాసుప్త వరకేసరిఁ గెలిపి
మొనయబెట్టు వివేకహీనుఁ డెవఁడు?
లీలానస చర కాల లాహిక హ్యాకైఁ
బవళి పుసుసుమూర్ఖ భావు డెవఁడు?
గీ తన్ను హరియింపసమకట్టియున్నవాని,
ఘోరయమరూపమున తన్నుఁగోరువాని,
వికటశత్రువుపిలువ నీవొకఁడు దప్ప
కలరె యెవరైననీభూమి కంసరాజా.

కంస — ఛీ! పలుగాకీ! కన్నుమిన్నుఁగానఁగవా? నాయెదుట నానిర్భయముగ ననాచ్యములఁ బలుకుచున్నాఁడవు? అధికప్రసంగీ! నిన్ను కార్యాకార్యముల నేను విచారించితినా? విధించిన కార్యము నీతలపైనున్నది నాశాసనము నీకుఁ దెలియును కదా? నీవీకార్యము నొనరింపవలయు ననుట యొకటి; యముని సన్నిధికేగ వలయుననుట మరియొకటి. ఈరెంటిలో నొక్కటి నీకుఁ దప్పినది కాదు? పొమ్మిచ్చటనుండి' రేపు సాయంసమయమున నా బలరామకృష్ణుల నా కప్పగింపనే వలయు.

మ అరుదామోగద మూఢచిత్త భవదీయాపారపాండిత్యమీ
ధరణిన్ బాలుని, శక్తిదూరుని, నిరాధారాత్ముని, హీనునిన్
వరవీరుండని ధీరుఁడంచని రణప్రావీణ్యుఁడంచుం జెదో
ఖరఖడ్గాంచితధారదృంపనె మహాకష్టంబె దుష్టాత్మకా.

ఎ తశత్రువైనను వాఁడొకఁడేకదా యుంకునది ?

అక్రూర — రాజేంద్రా! శాత్రవుఁడొకఁడైననేమి ? అతఁడు త్రిలోక

వీరుఁడు. పూతనను వధియించెనే కృష్ణుఁడొక్కఁడే కదా యుం
డెను ?

సీ. ఘనరూపపూతన చనుబాలుగోలుచు
నుర్విపైఁ గూల్చె తానొకఁడె కాఁడె ?
అలతృణావర్తుని నవనిపైఁ బొలియించె
నొప్పరనాబాలుఁ డొకఁడె కాఁడె ?
ప్రకటబాహాబల శకటాసురునిఁ గూల్చె
నురుశక్తి గోపాలుఁ డొకఁడె కాఁడె?
విపులశౌర్యవిభాస వృషభాసురాదుల
నొక్కటపరిమార్చె నొకఁడె కాఁడె ?

గీ. ధేనుకాసురు కడతేర్చె; కాననాగ్ని
మ్రింగ నేర్చెను; కాళీయుపొంగు నార్చె;
నొక్కఁడే కాఁడె శ్రీకృష్ణుఁ డొక్కఁడంచు
ప్రేలవలదింక నీపాలిమృత్యువతఁడు.

రాజు. నాకుఁ జేటు సంభవించుతఱి దాసులు తమ యభిప్రాయముల వెల్లడింపకుండుట చెప్పరాని యధర్మము; గావున నింతవచించితి. నీవు పూతనఁ బంపి యేఫలమును సాధించితివి ? తృణావర్తశకటాసురుల నూల్కొల్పి యేలాభమునొందితివి ? అఘాసుర, ధేనుకాసుర, గార్ధభాసురు లను నీమంత్రుల నా కృష్ణునిమీఁదఁ బంచి యేపురుషార్థమును సాధించితివి ? వానితో సాధింపనికార్యసిద్ధిని దీనసాధించెదవు గాఁబోలు ? వానికంటె నా గోవిందుని నిందు బిలిపించుట మంచిదంచుకవి శేషము కలదు. అప్పుడు కార్యవైఫల్యమొక్కటి మాత్రము లభించుచుండెను. నేఁడు కార్యనాశనమునకుఁ దోడాత్మనాశనమును లభింపఁగలదు. నేనేమి చేయుదును? అవశ్యము పోయెదను.

రాజాజ్ఞను మీరి స్వామిద్రోహము నకొడిగట్టి బాలుని మొదల
నైన వెళ్ళి వచ్చెదను.

కంస—(మహాకోపముతో) ఓరీ! దాసులవలన నీతి నేర్చుకొనవల
యునా? ఆ బాలునిఁ జంపుటకు మున్ను నిన్ను జంపెదను.
మారాడితివా చచ్చితివింక! దుర్భాషణము వేసినసరి, లేకు
న్న నీఖడ్గమున— —(అని ఖడ్గమెత్తును)

అక్రూర—నిన్నా నేను శరణొందునది! బాలఘాతకుఁడవై, యన్యా
యతత్పరుఁడవై, గోబ్రాహ్మణహింసకుఁడవై, పరమపాతకివై
యున్న నిన్ను దుర్భాషణవేఁడికొనిన నత్ఫలమేమైన లభింప
గలదే? సర్వలోకశరణ్యుఁడగు నా గోవిందుని శరణొంది
దుర్లభమగు మోక్షపదవి నొందెదగాక. నీవింద్రుఁడవు, చం
ద్రుఁడవని యెల్లవేళల స్తోత్రముఁజేయు నీమంత్రులమాటలు
నీకు పథ్యములగును, నీతిబోధనములు నగు. కానిమ్ము; ఇదె
పోయెద. నీవెత్తిన బాహులదండము, నేనీకంఠంపు విష్ణుభక్తుడ
నేని యట్లె యుండునట్టు నిల్చుగాక. రాజద్రోహము రా
కుండ నీయుప్పుదినినందుకై నీకు పుచేయువాఁడ.

(అని వెడలిపోవును. కంసుఁడెత్తిన ఖడ్గమట్లె యుండును)

యవనిక పడును.

---

చతుర్థాంకము—తృతీయరంగము.

మథురాపట్టణము—కృష్ణగృహము.

(దేవకీ వసుదేవులుందురు)

దేవకి—ఎన్నఁడు నానందనునిఁగాంతును? ఎన్నఁడు నాముద్దులకృష్ణ
య్యనుఁ దిలకింతును! ఎన్నఁడు నాచింతల తుదిఁగాంతును?
ఆ ప్రేవల్లెయందు శుక్లపక్షచంద్రకళలగితి దినదినము వృద్ధి

గాంచు వాసుమాయని నొక్కతూరి గాంచవలయునన్న సాధ్య
ము గాక యున్నదిగదా ?

సీ. లేవెన్నెలలరేని లీలం బాలిముంచు
సుకుమారుని గనుగొంటి జూచు టెపుడొ
సమ్మోద మొలిగి మా నయ్యా ! యని మురిపించు
తన ముద్దుపల్కుల వినుట యెపుడొ
చిత్తమానలగొల్ప నిత్తరిమ్మని చేతు
లెత్తగా మదిని హత్తించు టెపుడొ
అందంద చనుదెంచి చిందులు ద్రొక్కుచు
కోమరుండు గోర్కెల గోరుటెపుడొ

గీ. ఆటలాడుచు చేర ముద్దాడు టెపుడొ
చెలగి తొడపైన నిదురింపగలుగు టెపుడొ
కనుంగొనియుంగ మాకృష్ణుగాంచు టెపుడొ
అవని నాజన్మ సార్థకంబగుట యెపుడొ.

చ. పలికిరి నారదాది మునిభాగవతుల్, హరి కృష్ణనాము డై
కలియుగకీర్తి ధాముండై వెలిగ గాంచవచేయుండు గోకులంబునన్
కలికిరొ నీసుతుండనుచు గాంతుల దీరునటంచు సజ్జనుల్
చెలగుదురంచు నయ్యది విచిత్రమొ, సంభ్రమమో వినోదమో॥

మ. ఘనచిత్సత్త్వవభాసమై, శ్రుతిచయాగమార్థమై, శుద్ధమై,
అనిరూప్యంబునునై యనూహ్యచరమై యానందరూపార్థమై
సనకాదిస్థిరమానసాబ్జయుతమై సాక్షాత్పరబ్రహ్మ నా
తనయుండై జనియించెనౌర యిలమద్భాగ్యంబు సామాన్యమే.

చ. కనులముదంబు పెంచి తనకాంతులసద్మమునించి మెల్లడన్
మనమున ప్రేమ పెంచి బలుపల్కుల ముద్దులొల్కరించి మ

మ్మనువుగ నాదరించి మణిహారరుచు ల్వెలిగించి మించుమిం
చినగతి కానడాయె నిఁక చిన్నికుమారునిఁ గాంచుటెన్నఁడో.
మ. మను నెండై నఁదలంచునో, తలఁచఁడో, మా యొద్దకే తెంచునో
భ్రమ దాపిర్భవవేళఁ దామర చనో, భావించెనో, యెంచఁడో.
కమలానాథుఁడు తల్లిద్రండ్రులఁగనన్ కాంక్షించునో కోరఁడో
కమలాక్షుం డిటుచేరఁగ ల్గెడినొ భాగ్యం బెట్లు రాఁజెల్లునో.
శా. కారాగారనివాసమోర్చితి, మహాకష్టంబులే నోర్చితిన్
క్రూరంబౌ సుతహానిఁ గోర్చితి, నదగ్రోచ్ఛిన్న కౌమారకా
ర్తారావంబును నోర్చితిన్, తనుజరక్తాసారమే నోర్చితిన్
ఓ రాజీవదళాక్షు! నిన్విడుచు టేనోర్వంగ లే నక్కటా.

గోకులబృందావనమున సుఖముగ నా నందనుఁ డున్నవాఁడని యించుక మనస్సంతోషముఁ గలిగియుంటినిగదా ? ఆసౌఖ్య మంతయు నేఁడు వమ్మయ్యెనే? నిన్న రాజాస్థానమున ధనుర్యజ్ఞమనెడి యొక మిషను గల్పించి యాగోపాలునిఁ గొని తెచ్చుటకై యక్రూరునిఁ బంపునటుల నాదురితాలవాలుఁ డగు కంసుఁడు నిర్ధరించినాఁడని యిప్పుడుగదా వింటిని? అక టా! దీని కేమిసేయుదు? పుట్టినక్షణముననే నిండువెన్నెలరేని చందమునించు నానందనుని మరలఁ జూచుభాగ్యము లేనట్ల య్యెగా? కట్టా, దీని కా యక్రూరుఁ డెట్లు సమ్మతించెను? వివ రముఁ దెలిసికొనుటకై నవకాశము లేకపోయెనే? పరమభక్తుఁ డై, యతిసుస్వభావుఁడై యున్న అక్రూరుని కిట్టిబుద్ధిపుట్టిన న్నింకెవ్వరిని నమ్మవలయు? అయ్యో! చెడుగుసంభవించు కాలమున నెట్టివారి కెట్టిబుద్ధి పుట్టునో యెవ్వరెఱుంగుదురు?

వసుదేవ.—అకటా! తరుణీ! నిజకుమారుని సందర్శించునభిలాషమున నింతవంత కుందెదవుగాక భవతారకుఁడైన పరమపురుషుని

కుమారునిగా బడసినందున భవ్యమోక్షపదవి కెదురుచూచు చున్నారమని దలంపవుగదా? కారాగారబంధనమే యుండుగాక; అవాచ్యకష్టములే కలుగుగాక? చిత్రహింసలే సంభవించుగాక. నిరంతరయోగిజనమానసకమలకర్ణికారవిరాజమానమై, నిత్యానందాఖండపరంజ్యోతిస్స్వరూపమై, లక్ష్మీ మందిరమైన సత్స్వప్రకాశమును గంటిమి ధన్యతగంటిమి గదా! ఆహా! కృష్ణకుమారా! అవిదితప్రభావారా! నిన్ను యోగులు గాంచనేరరు. పరమజ్ఞానయోగులు తెలియఁజాలరు. మేము నీస్వరూపమును కనులార చూడగల్గుట మాపుణ్యవిశేషమేగదా?

ఉ. కానరు యోగిపుంగవులు కానరు సాంఖ్యమతావలంబులున్
కానరు కర్మయోగులును కానరు భక్తివిశేషసిద్ధులున్
కానరు జ్ఞానసిద్ధులును కంజదళేక్షణ నిన్ను కన్నులన్
కానఁగఁ జేయుటెల్ల తొలిగల్గిన పుణ్యఫలంబుకాదొకో.

శా. శోకంబల్లనహెచ్చె, తాపగరిమన్ శోషిల్లె నంగంబు ను
ద్రేకంబారగశక్తిదూలె మనము ద్వేగంబునుం జెందె నీ
లోకంబారెను భాగిశోచ నినునాలోకింప కీధామునన్
శ్రీకారుణ్యపయోనిధీ! మనుదుమే చింతాగ్నిజీవింతుమే.

[ప్రవేశము — అక్రూరుఁడు]

అక్రూర — అమ్మా! దేవకీదేవి! నమస్కారములు. ఊరడిల్లుము. ఇంతలోననే నీనందనుని దిలకింతువు లెమ్మా.

దేవకి — అన్నా! అక్రూరా! నమ్మియున్న నీయట్టివాఁడుసైతము పరోముఖవిమకుంభమై నానందనుని హింసింప నమకట్టియుండ నాకూరట యెట్లుకలుగును? జీవిత మెట్లునిలుచును?

అక్రూర—అమ్మా! ఎట్టికర్ణకంటకములగు మాటలనాడితివి? ఆకంసుని దురుద్దేశమునఁ దనతాపుఁ దప్పి, క్రూరభాషణములకుఁ గడునొచ్చి, కంసశాసనమున గళవళపడి, నాకుఁ గలిగిన యంతస్తాపదవానలమున మాడి వెలికివచ్చి పోవు నాజీవితలతను మొదలంట నేఁడు కోసివైచితివి. జననిరో! నాకు స్వామియై, నన్ను మన్నించు ప్రోడయై, నాదైవదైవమైన గోవిందునికి నానోటివెంట కృత్రిమసంధానము వచింపవలయునే యని దుఃఖించి, దుఃఖించి, భవాదృశసాధ్వీమణి నానిష్కల్మషత్వము నెఱిఁగి, నాతాపముఁ బాపును గదా యని నమ్మియుంటినిగదా? ఊరివారందఱు నను దూషించుచున్నను, పశ్చాత్తాపవహ్ని ననుఁగాల్చుచున్నను, దుష్కృతమూలములగు నారకహాలాహలము నను లోలోన హింసించుచున్నను, పరమపురంధ్రీమతల్లియగు నీయాదరణము నెడిపట్టుకొమ్మ యొకటియైన లభించునుగదా యను నూరటచే విసికివిసికి పరివాసువాడుచున్న నామానసలతీవె నతిభారముగ మోసికొనియుంటినే? నాభక్తిభావన శీలముల నెంతవఱకెఱిఁగియున్న నీకే కరుణగలుగకయున్న నాబృందావనమునందింకెవ్వరు నాయందక్కటికముఁ జూపఁగలరు? తల్లిరో! నను భీకరాగ్నిజ్వాలల నింతింతదహించియున్నను, సకలశస్త్రసంచయములచే నాయంగముఁ దుత్తునియలుగ ఛేదించియున్నను, నన్నొక తైలకటాహముననుంచి చలచలకాచి మర్దించియున్నను, మహాయంత్రముననుంచి సకలావయవముల వేఱుపఱచియున్నను, అంతయును సంతసమున భరించుచుంటినిగాని యిట్టి మర్మభేదనములై, జీవచ్ఛరీరహింసకములై, తాపాతితాపావహములై, నిరతపాపోద్రేకములై, నీయట్టి

సతీమణి నోటివెంట వెలువడిన యీ యపనిందావాక్యముల నేఁ భరింపఁజాల. భరించి యిఁక బ్రదుకఁజాల. జననీ! మనోవాక్కాయ కర్మముల నేక్షణమునందైన, నేఘడియనైన, నేయామమునయైన, నేదినమునయైన, నా మానస మిట్టికల్మషావహ ఘోరవంచనకార్యమున కెడమిచ్చియుండిన మొగమెచ్చకములకైనను, మతిభ్రమచేనైనను యీ వేదాంతవీధికాలోలు, రక్షితలోకజాలు, కరుణాలవాలు, మణిమయకపోలు, భక్తావనశీలు, నాగోపాలబాలునెడ దుశ్చింతన మొనర్చియుండుసేని మదీయజిహ్వాగ్రమున క్రిమికీటకములు జనించుఁగాక. అస్మదీయాంగంబునకు మూర్ఛ, క్షయ, కుష్ఠు, పాండురోగాది లోకసారియై జనించి మలమూత్రములఁ బొరలాడి, కాక, క్రిమి, గృధ్రకంబులచే భుజింపఁబడుఁగాక; రౌరవాది నరక నివహంబులన్నియు, నన్ను లొంగొని దుర్గంధపూరితశోణితముల ముంచి నిమిషనిమిషమున కింతింత యెక్కువగ బాధింతురుగాక. ప్రాణావసానవేళయందు దిక్కులేక, నానోట నింత నీరుపోయువారైన లేక, స్మశానంబునఁబొరలాడి, ఘోరపిపాసాబాధితుఁడనైన, నాయవయవంబులు మంటకలియునుగాక. అమ్మరో! ఇందుకు ధర్మాధిదేవతయగు యముఁడును భువనైకరక్షకులగు త్రిమూర్తులును, యెల్లవేళల నెల్లచర్యల బాయకచూచు సూర్యచంద్రాష్టదిక్పాలాదిదేవతలును సాక్షులగుదురుగాక. ఇంతకును నమ్మవైతివేని నన్నిదె నీశాపాగ్నిచే దహింపుము. వలదనను. (అని చరణములఁబడును.)

దేవకి—(ఆలింగనము జేసికొని) అన్నా! నీయాత్మశుద్ధినరయక పల్కినమాటలకై కనలకుము. అక్రూరా! ఆకృష్ణునియందు దోడ్రేర కంసుఁడు తలఁచియున్నాఁడే. ఏమిచేయుదును? ఆ కృష్ణునితో

సీ. అలనాఁడు కలఁగాంచినట్టుల నినుఁబంపి
వంతఁగుందెదమంచు బలుకుమన్న
పరమాత్మ! నిను పుత్రవరుఁగాంచియు దుఃఖ
మునుగాంచ మాపాప మసఁగదన్న
బంధనాలయములో బహుకాల మిఁక మేము
మనఁజాలమని నీవు వినుపుమన్న
అంతలో నొకసారి యమలమౌ నీరూపు
వెలయఁజూపుమటంచుఁ దెలుపుమన్న

ఆ. వె. కరుణమూని మమ్ము గాంచ నుపేక్షింప
మాదు ప్రార్థియంచుఁ బలుకుమన్న
వేణుగోపబాలు వేడుకఁదిలకించి
రాగదన్న శుభము తేఁగదన్న.

అక్రూర—అమ్మా! నీవేమియు భయపడకుము. కంసునకు కాలమాసన్నమైనది. ఏదేవుని, శస్త్ర, వహ్ని, వాయువులు శోషింపఁజేయ నేరవో, ఏపరంధాముని సంకల్ప వికల్పముల భువనములు జనించి లయించునో, అట్టివాని కంసుఁ డేమియుచేయఁజాలఁడు. రాజాజ్ఞోల్లంఘన పాపము రాకుండ నాగోపాలదేవునిఁ గొనితెచ్చుటకై పోవుచున్నవాఁడ. ఆయుదంతము నీతో వచింపవచ్చితి. నాకానతిమ్ము. నేఁబోవలయు శీఘ్రకాలము. నీకుమారుని నీయొద్దకుఁ దెచ్చెద.

(నమస్కరించును.)

(దేవకీ వసుదేవు లాశీర్వదింతురు యవనికపడును.)

శ్రీ

# కృష్ణలీలనాటకము.



పంచమాంకము—ప్రథమరంగము.



బృందావనసమీపారణ్యము.

[ప్రవేశము—అక్రూరుఁడు.]

అక్రూరు—ఆహా! నేఁజేసిన తపం బెంతకలదో! నే నొనరించిన వ్రతసముదయం బెంతకలదో! ఆదేవదేవుని, నాశేషాహిశయనుని, నీలనీరదశ్యాముని, సోమనిభఫాలుని, నా సకలలోకాభినందనుని, నందనందనునిఁ జూచుభాగ్య మబ్బెకదా ?

ఉ. ఎట్టితపంబుచేయఁబడె? నెట్టిచరిత్రము లబ్ధమయ్యెనో?
యెట్టిధనంబు సర్వులకు నీఁబడెనో? తొలిజన్మమునందు నా
యట్టివివేకహీనునకు నాదిమునీంద్రులు యోగదృష్టులం
బట్టఁగలేని యీశ్వరుని బ్రహ్మమయున్, హరిఁ జూడఁగల్గెడిన్.

అయ్యో! సద్భావనలేక, కంసుఁడొనర్చు వంచనవిధానమునకై నేఁ బోవుచున్నాఁడగదా? నాయట్టి దురాత్ముఁ డెందైననుండునే! మాగోవిందుని పాదారవిందసేవచే ధన్యుఁడగుటమాని యతనిని బాధించుటకై కొనితేరఁబోవుచున్నాఁడుగదా? ఔరా! యిదియంతయుఁ బరసేవాప్రయోజనముగలిగిన యనర్థము కదా? లోకమున జను లేల స్వాతంత్ర్యము నపేక్షింపక, పరతంత్రమగు నుద్యోగముల నపేక్షించుచున్నారు? ఉదరపోషణమే ఫలితార్థమని యెంచి విద్యలనభ్యసించుట సైతము పరులసేవఁజేయుటకయ్యె యనుకొనుచున్నారు. అయ్యో! ఏది

మెట్లున్న నేమి? శ్రీకృష్ణమూర్తి దర్శనభాగ్యము కలుగును గదా? ఒకవిధముగ నాలోచింప కంసుఁడు నాకు పరమమిత్రుఁడని తోఁచుచున్నది. ఆతనివద్ద నెందఱు సేవకులుండలేరు? వారినందఱిని వలదని నన్ను శ్రీకృష్ణమూర్తినిఁ బిలుచుటకై పంపియుండుటఁ జూడ నాకంసునికి నాపైఁగల యకృత్రిమప్రేమానురాగమును సూచింపుచున్నది.

ఉ. సూరులు దాల్చి యేవిభుని శోభితపాదనఖప్రభావళిన్
జేరి భవాంధకారములఁ జిక్కక దాఁటుదు రట్టిదేవునిన్
వైరముతోడనైనఁ బిలువన్ ననుఁబంచి శుభంబుఁ జేసె ని
ష్కారణమైన ప్రేమ సదె కంసునిఁబోలు సఖుండు గల్గునే.

ఆహా! అలకభ్రాజితమై, యలంకృతమయూరపింఛమై, యతిప్రభామణికుండలమండితకర్ణమై, యమితదయారసమై, యంచితమందహాససుందరమై యొప్పారు నా సనకసనందనానందుని, నాయజరుద్రాదివందితపాదారవిందుని, నాగోవిందుని మోముఁ జూచుభాగ్యము కలుగనో కలుగదో తెలియదు. ఈదురాత్ముఁడు, కంసుని పంపునవచ్చినవాఁడు; వీనిదర్శింపఁ బాపమని యెంచి నాకు దర్శనమిచ్చునో? యివ్వఁడో? తెలియదు.

మ. ఇతఁ డాకంసునిచేతఁ బంపువడి నన్ హింసింపనేతెంచినాఁ
డతిదుష్టుం డని చూచునో సకలభూతాంతర్బహిర్వ్యాప్తసం
గతుఁ డౌటం దలపోసి నన్ను సుజనుంగాఁ జూచునో యెట్టియు
న్నతిగావించున్ యేక్రియం బలుకునో నాభాగ్య మెట్లున్నదో.

(యోచించి) నేనేల చింతింపవలయు? సకలభూతాంతర్యామియై, సర్వజ్ఞుండగు నాపరాత్పరునకు నామానసశుద్ధి తెలియకుండునా? అవశ్యము నా కాముకుందుని సాక్షాత్సందర్శనభాగ్యము

బ్బుటకు సందియము లేదు. మృగము లెదురుచుండి కుడికేగుచు న్నవి. భళిరే! నేను సాయంకాలమునం జని యావైకుంఠమహీ మానందము, నాబృందారకపురీరక్షణానందము నాగోవింద పాదారవిందదివ్యరేఖానుందిరము, నమేయ భాగ్యబృందము నగు నాబృందావనముం జొచ్చి యందు నందునిమందిరమునొం ది, యందుపరికాశించు దివ్యపరిబారోదిష్ణుల, నకలదానవజ యిష్ణుల, దివ్యకౌస్తుభాలంకరిష్ణుల, రామకృష్ణులందర్శించి సా ష్టాంగదండప్రణామంబు లాచరించిన నాభక్తవత్సలుండు శ్రీల క్ష్మీకుచసంపత్కరమై, భక్తిమోక్షశ్రీకరమై, సనకాదిచిత్త వశీకరమై, భువనత్రయాకరమై, బ్రహ్మాదామస్తకవి భాకరమై వెలరారు నాయభయకరంబు, నాయౌదలమోపిన నాతపంబు ఫలింపదే? నాభక్తి యీడేరదే? నాకోర్కె యీ డేరదే? చూచెదగాక.

ఉ. మాపటివేళ నేను జని మాధవుపాదసమీపమందు దం
డాపతితుండనైన నతఁ డాసుకరాబ్జభుజంగ వేగసం
తాపితభక్తలోకభయదారుణమైన కరాబ్జ మాదలన్
మోపిహసించి నాకభయమున్ కృపతోడుత నీయకుండునే.

(నిష్క్రమణము.)

---

## పంచమాంకము - ద్వితీయరంగము.

### బృందావనము - నందునిభవనము.

[బలరామ కృష్ణులును, యశోదయు, నందుఁడును
కూర్చుండియుందురు—గోపబాలకులు
సేవఁజేయుచుందురు.]

యశోద—అన్నా! కృష్ణా! నిన్ను మనగోపకులందఱు నితఁడెవ్వఁడో మహనీయుఁడని చెప్పుచున్నారే? నిజమా?

శ్రీకృష్ణ—అంతయు కల్ల. నాగరికత తెలియని బాలకు లట్లు చెప్పుచున్నారు. ఇపుడు మహనీయులమని కుంకుమరేఖలుం పెట్టి వేదాంతులమని రుద్రాక్షమాలికల ధరించుకొని యుండు లోకవంచకులు ప్రబలియున్నారు. గనుక నేనును నెమలిపింఛము ధరించిన వాండ్లు చెప్పుచున్నారు.

యశోద—అదికాదు. నాయనా! బ్రాహ్మణులుకూడ నిన్ను దేవదేవుఁడని చెప్పుచున్నారే? దీని కేమనెదవు?

శ్రీకృష్ణ—బ్రాహ్మణులా! వారేమి, కొంచెము దక్షిణ యిచ్చిన, గావలసినంత పొగడుదురు.

యశోద—ఏమో! నీమహిమ మొక్కటియుఁ దెలియకున్నది.

సీసమాలిక.

యశోద—అన్న! మనయూరి పిన్న పెద్దలు నిన్ను
శ్రీహరియని రేమొ చెప్పుచున్న;
శ్రీకృష్ణ— గోపబాలకుఁ జేడ గోవిందుఁ జేడ నా
పిచ్చిమాటలనింక మెచ్చకమ్మ;
యశోద— ఒప్పార గోవర్ధనోద్ధారి వని ద్విజుల్
పలికిరి యదియేమొ పలుకుమన్న;

శ్రీకృష్ణ—భోదనం బిడ మహారాజని వినుతించు
నెమ్మి బాపలమాట నమ్మకమ్మ;
యశోద—బొజ్జలో లోకముల్ పోషింతువని గర్గ
ముని చెప్పె నదియేమొ వినుపుమన్న;
శ్రీకృష్ణ—వృద్ధులకెల్లైనఁ బుద్ధిమాంద్యముగాదె
వారిమాటల వినవలదమ్మ;
యశోద—సాక్ష్యమేటికి, నేను జగముల నీనోటఁ
జూచితి నదియేమి చోద్యమన్న;
శ్రీకృష్ణ—అమ్మ! చిత్తభ్రమణమ్మ నీకయ్యెగా
కెటుల నోటను జగం బెట్లుండునమ్మ;
యశోద—గీ. ఏమిరీతియొ, నీకథ యేమికలదొ
యేది తెలియదు గోపాల నీదులీల
శ్రీకృష్ణ—నీకుమారుని కథలను నీవెఱుంగవె
భ్రాంతినొందకమ్మ చేకొమ్మ రాననమ్మ.

బల—అమ్మా! మనకృష్ణుని నీవొట్టి బాలుఁడనా? వానిమర్మము వానికే తెలియును.

నందుఁడు—కాంతామణీ! ఏమియుఁ దెలియని పసికూన నేమేమో పర్వతోద్ధారుఁడవని, లోకేశుఁడవని యూరక నాడికొనుట తగదు. ఇఁక లోకులందరన్న నదివారికి నైసర్గికము. శక్తిలేని వస్తువులయం దొక్కఁడు మహిమయున్నదని భ్రాంతిపడినా యందఱు వానినే యనుసరింతురు.

సీ. పసిఁడిశాలువ నెంతో భరముగ ధరియించు
నీవా పబలుకొండ నెత్తగలఁడా?
వేణువు మోయున నూనఁజాలని పట్టిఁ
డ ఫణిఫణసీమ నాడఁగలఁడా?

లేయెండకసిగందు లీలల బాలుఁడు
మేలికార్చిచ్చును మ్రింగఁగలఁడె?
కనుల నెఱ్ఱఁగఁజేసి కాంచిన లేపాటు
కూనరక్కసులను కూల్చఁగలఁడె?
గీ. జాడ కానఁడు పరమోక్తులాడఁగనఁడు
వేఁడుకలఁబోఁడు అలలనాడలేఁడు
చూడఁజాలఁడు కోర్కెల వేడరాఁడు
వాడిమగఁడౌను గోపాలబాలుఁడకట.

శ్రీకృష్ణ—జనకా! అంతయే! నేకనుమూసితినా! ఒక్కటియు లేదు. కనుఁగొని తెఱచితినా, అంతయుఁ గలదు. నాశక్తియే నాకు గాని, వేఱుశక్తి గానను. అన్నియు వినుదును. అన్నియు నను వినలేవు. ఇట్టివానిని లోకులేమేమో యనుకొందురు. వారిని మెప్పించుట మనకు సాధ్యమా?

[ప్రవేశము—ఒక గోపాలుఁడు.]

గోపాల—గోపాలదేవా! ఎవరో అక్రూరుఁడఁట; మధురాపురినుండి వచ్చియున్నాఁడు.

శ్రీకృష్ణ—అక్రూరుఁడా? త్వరగా నతనిని బిలుచుకొనిరమ్ము.

గోపాల—భాగ్యము. (నిష్క్రమణము.)

[ప్రవేశము—అక్రూరుఁడు శ్రీకృష్ణునికి నమస్కరించును.]

శ్రీకృష్ణ—అక్రూరా! కూరుచుండుము. మధురాపురిలో మా మాతామహుఁడుగ్రసేనుఁడు క్షేమముగా నున్నాఁడా? మా మామ కంసునికిఁ గుశలమా?

అక్రూ—దేవా! అందఱును క్షేమముగానున్నారు. అంతకంటె పూజనీయులగు వారిక్షేమమును మీరడిగినను నడుగకపోయి

నను నేఁ జెప్పవలసియున్నది. నిను నందనునిఁగాఁ బడసినవారు సహితము ప్రమోదమానసులై యున్నవారు.

శ్రీకృష్ణ—నీవనునది మాజననీజనకులగు దేవకీవసుదేవులవిషయమా? వారిని పాదాభివందనముఁజేసి కుశల మడుగవలసి యున్నది. అక్రూరా! నీవు వచ్చునపుడు మాజననీజనకు లేమైనఁ జెప్పిరా? లేక ప్రాణావశిష్టులై వగచే నేమియుఁ బలుకరైరా?

శా. నిన్నాకంసుఁడు పంప గా విని రో, సన్వీక్షింప లేకుండిరో
అన్నీ చాత్ముని భృత్యుఁడంచు నినుమాటాడింపఁగా రోసిరో
కన్నీరీధర బార కంసుచరితల్ గాథంబుగాఁ బల్కిరో
అన్నా! పల్కుము తల్లిదండ్రులిటు నన్నాశించిరో సుక్కిరో.

అక్రూర—దేవా! సర్వేశ్వరుఁడవగు నీకుఁదెలియని యుదంతము గలదా? అయినను వచించెద. నీజననీజనకు లాకంసునిచే బాధితులై దిన మొక్క యుగముగా కాలము గడుపుచున్నారు. నీ పెన్పాటు చనదెంచి ప్రేమునిండారఁ దమ్ము బాధ విముక్తులఁ జేయుదువోయని యనవరతము నీ రాకకై యెదురు చూచుచున్నవారు. మఱియుఁ దిర్లోకాధి నాథుఁడగు భవాదృశతనూజుఁడు తమకు గలిగియుండియు సెనలేనికడగండ్లకు లోనగుట తమ దురదృష్టమని వచింపుమని చెప్పియున్నారు.

శ్రీకృష్ణ—అక్రూరా! దేవకిని సమయము రావలయునుకదా? నేను దూరమునయున్నను, వారికష్టదశ క్షణక్షణమునను నామది యందు మెదలుచునేయున్నది. కానిమ్ము. అదియుండనీ. నీవు —— వచ్చితివి? నీరాక యేదియో యొకపనిను సూచింపుచున్నది.

అక్రూర—దేవా! నీకంటె విశేషముగలవా? మీ మామ ధనుర్యాగముఁ జేయఁబూని మేనల్లుండ్రకు మీ సన్నిధానము నపేక్షించి, మిమ్ముఁదోడ్కొని రమ్మని నన్నుఁబంచియున్నాఁడు. రేపుప్రాతఃకాలముననే పయనము కమ్మనియుఁ జెప్పుమన్నాఁడు.

శ్రీకృష్ణ—అట్లనా? మామామ కంసుని కల్లుండ్రపైన మిక్కిలిప్రేమ గనుక నే నాయన యానతి శిరసావహించి వచ్చెదను. తల్లీ! నా కానతిమ్ము. నేఁబోయి మా మామ యజ్ఞమును సాంగము జేసి వచ్చెదను. లోకమునకు సంతోషము కలుగ జేసెదను.

యశోద—కుమారా! కంసుని యజ్ఞముతో మనకేమి? పెద్దవారు యింటికిఁబిలుచు పోకటియేగాని మర్యాదయుండదు. బీద వారు వారికట్టి కగపడరు. ఇదియుఁగాక కంసునకు మన యందుగల యవ్యాజకరుణయుందుమా యది పరమాద్భుతము. కట్టా! పూతననుబంపి, తృణావర్తాది రక్కసులంబంపి, నిన్నుఁ గడతేర్పఁజూడలేదా? నీమరణమునకై యనవరతము విళ్ళూరుచున్నాఁడని మనము వినలేదా? అట్టిచోటికేల పోవలయు?

శ్రీకృష్ణ—జననీ! అట్లుకాదు. నేను కష్టపడను. మా మామకు దివ్యసుఖము నివ్వక మానను. నన్నుఁజూచిన సంతోషమున మా మామ యీలోకమున నుండునా! ఏమియు భయపడకుము. పూతనా శకటాసురులనుండి కాపాడిన నాఁటిదైవము నేఁడు లేఁడా? నా కార్యమంతయుఁ దుదముట్టించి వచ్చెద. ముఖ్యము కంసునిపనిఁ దీర్చివచ్చెదను.

యశోద—తనయా! పోయిరమ్ము. నీమాటకేమియు బదులు చెప్పఁజాలను. అయిన నీవు జనించిననాఁటినుండియు నేనీప్రపంచ

మునే మరచియుంటిని. లోకమోహనమైన నీ చిరుమేనును, లోకాశ్చర్యములగు నీబాలక్రీడలును, లోకోత్తరములగు నీ ముద్దులపలుకులును, నామదిని నాటియున్నవి. నిన్నుఁ బుత్త్రుఁడని శాసింపఁజాలను. అన్యుఁడని యుపేక్షింపఁజాలను. నా గోపాలుఁడవని సంతసింపఁజాలను. వలదనఁజాలను. బోధింపఁజాలను. కుమారా! నామానసమును, నాసర్వాహికాశలును, నా కోర్కెలును, నా గారాబమ్ములును, నాపంచప్రాణములును, నీ వేయని నమ్మియున్న దానను. నీవు తల్లివని భావించినను, గురువని మన్నించినను, పూజనీయురాలని యాదరించినను సరియే. నీవు లేని లోకమే నాకు లేదు. నిన్నుఁజూడనిలోకమే నాకు గానరాదు. గోపాలా! నీవు మరలివచ్చువఱకునునిమిషమొక్క బ్రహ్మకల్పముగాఁగడుపుచుండెదను నీకార్యములకు నీవు చేయునెంచిన కార్యములకు సత్యాధిదేవతలు సహాయులై యుందురుగాక. నీ శరీరావయవమ్ముల నశ్వినులును, వాయువును, ఇంద్రోపేంద్రులును, రక్షింతురు గాక. అన్నా! నీవెక్కడనిలచిన నదియే పరమపదము. నీవాక్యమే వేదవాక్యము. నీకృత్యము పరమార్థము. అట్టిచో నన్ను మఱువకుము నీ మాతయగు నా మాటలయందింత విశ్వాసముంచుము. ఈ రేపల్లెకు మరలి నీవు వచ్చువఱకును నే నీలోకమునే మరచియుందును.

సీ. మందారమబ్బిన మందభాగ్యయుఁబోలె
నురుతరామోదనై యుంటినన్న
నినుబోలుతనయుండు ననుఁజేరియుండనా
యనసమితశఃఫలం బంటినన్న

అమృతవిభుల జిహ్వ నందంగ నీసుద్దు
లాలించి యదిస్వర్గమంటివన్న
నిమిషంబు గనకున్న నిఖిలంబు కానలో
గాచినవెన్నెలై తోఁచునన్న.
గీ. మిత్రశత్రులనారసి మెలఁగుచున్న
యెల్లదేవతలామోదమిత్తురన్న
నీకు మోహప్రగమతి సుమ్ము చేరవన్న
పోయిరావన్న శుభములఁబొందవన్న.

శ్రీకృష్ణ —
సీ. పరమాత్మశక్తి యాచతురుఁడైన నాకునై
యెనలేని యీచింత యేలనమ్మ?
మామాయ మానుషానుమానచరియించు
ఘనసంగోశభద్రముల్ కలుగునమ్మ
కలుగదే విరహంబు చెలఁగదే పరిమోదంబు
సుఖదుఃఖపర్యాప్తిఁ జూడుమమ్మ
శకటాదిసంహార సమయోదయాఘువో
ఘనుఁడైన మీనాఁడు గలుగఁడమ్మ?
గీ. చెలఁగి భవదీయ శుభతరాశిషములొంద
కలుగ వేదురితములంతఁ దెలియవమ్మ
ఫలితకాంక్షత నేవేగవత్తునమ్మ
పరమశుభమున సన్నింకఁ బంపవమ్మ.

యశోద — పోయిరమ్ము. మార్గమున నీకు శుభంబయ్యెడుగాక.

శ్రీకృష్ణ — తండ్రీ! నాకు నానతియా?

నంద — కృష్ణా! నేనేమందును?

సీ. చిటిపాపడై నీకు చెనటిపూతన బారి
గండమొక్కటి నాఁడు కలిగె నన్న
అందాకు నుంటివో నాటాడ సుడిగాలి
గండ మింకొక్కటి కలిగె నన్న
బాలలీలల నొక్క బాలుఁడై శకటాసు
రుని చేత కష్టముల్ కనితివన్న
అన్నరో! యొకనాఁడు కన్నాగ సుడిఁదిరి
గాంచక కష్టించుఁగంటివన్న
గీ. ఇపుడు కంసుని చెంతకు నేగకన్న
ఏమికష్టము కలుగనో యెఱుఁగనన్న
పూని మామాట నాలింపఁ బోలునన్న
మమత నినుబాసి మేమెట్లు మనుదుమన్న.

కుమారా! నీ వెవరవో, మే మెవరమో, తెలియఁజాలము. నీవు పోయిన నే శుభము కలుగునో యే యశుభము సంభవించునో తెలియదు. నీ వంగారు సముచితాలాపములవినుచున్న బృందావనమున నున్న గోపాలురును, గోపకాంతలును, గోవులును, గోశిశువులును నమతయు యాహారములమాని నీవిర హాదుఃఖమును సహింపఁజాలకుండును. కంసుని చే, నృశంసుని చే మాకెన్నియో కష్టములు కలుగుచున్నవిగదా ? కృష్ణా! నీ యభిమతమునకు మా రాడఁజాలను. కావున పోయి రమ్ము. నీ కార్యము సఫలమగుగాక !

శ్రీకృష్ణు—(తల్లిదండ్రులకు నమస్కరించి)

(అనుబంధము 44)

(గోపకాంతలఁజూచి) గోపకామినులారా! మదుదారకరుణా భూషితలారా! నాకానతింను. మధురాపురిజేరి మామామకు

శాశ్వతసుఖమొసఁగి, సిద్ధార్థుఁడనయి లోకముదంబునను, విబుధాలోకముదంబును, పౌరజనాస్మదీయాలోకముదంబును, నొసంగివచ్చెద. మీ నిర్మలచంద్రాలోకహృదయసీమలయందు కృపారసము ప్రతిఫలింపనన్నాశీర్వదించి పంపుడు. మీరును నిరంతర స్త్రీధర్మపరిపాలికలై, పాతివ్రత్యాలంకారవిరాజితలై యుండుడు.

గోపిక—కృష్ణా! నీ కిది ధర్మమా? నీ యాశ్రయమే సకలదురితలతాలవిత్రముగ, నీపాదారవిందధ్యానమే నిరుపమాన వైకుంఠసోపానముగ, నీదయావీక్షణమే యక్షీణమోక్షాధిరాజ్యపదవిగా, భవదీయ సాక్షాత్కారమే బ్రహ్మానందవిభూతిగా నెంచుచున్నాల, మహోదధియందు, నావ జనులనుముంచినట్లు పారభవసముద్రమున ముంపఁజూచెదవే?

2. వగోపిక—ఈ గుణహీనని, నీమహావంచకుని నమ్మి యున్నదంతయుఁ బాసి తేసిదాని కెనుకుజూచుచున్నారు. ఇంక నితనిని పూజింపరాదు. మనమనోపాశములబంధింతము. ఇతఁడు నిర్బంధించిన గాని నిలువడు. నిలచినను కానుపింపడు. కనుపించినను సూక్ష్మాకారుండుగానుండును.

1. వగోపిక—సీ. గుణహీనుఁడని పట్టుకొనకూడదందమా
అమలసద్గుణజాలహారుఁ డితఁడు!
ఆకార్యశూన్యుఁడై యులరునం చందమా
అఖిలలోకాకారుఁ డౌచునొప్పు
నొక్కచోనిలువక చిక్కడం చందమా
చిక్కబాసినవారి చెంతనుండు
ఇక్కడలేఁడు! తానెక్కడకలఁడని
చూతమా తలచిన చోటనుండు

గీ. వాని కనరాని, వెల్గులవాని కాని
రూపువాని తినంతట నోపువాని
మదిఁ బాధించి సాధించి వదిలవఱచి
నిలువ చేతము రారె యో నెలఁతలార.

కృష్ణ—అయ్యో! అళినీలాలకలారా! నేనెందుకు బోవుదునా?
నేఁబోవునది భువనపరిత్రాణమునకై యే గదా?

సీ॥ భువనావనాలోల భవనాశనాశీల
జనన మొందుట యింత కనఁగవలదె?
ఫలితాఖిలక్రియా కలితాలలక్ష్మియో
జ్వలుఁ డొచువచ్చుట తెలియవలదె?
ఖలవార సంహారములు మీఱ నోకలవ
కాలమంచును మదిఁగాంచవలదె?
ఘటితార్థవిఘటనా ఘటితార్థఘటనార్థ
దైవకృత్యము దీని తలఁపవలదె?
గీ. సంతతానంత ప్రోత్సాహశక్తిమీఱ
పరమకల్యాణవాదముల్ పలుకవలదె
నిరుపమాశివసంతతి నెఱుపవలదె
భవ్యరీతిని నను నింకఁ బనుపవలదె.

2 గోపిక—కృష్ణా! సరసీజేక్షణా! పరమసౌహార్ద్రభాస్వరశీలుఁడగు నీకిది పాడియా?

మ. సరసీజేక్షణ నీకటాక్షరుచి విస్ఫారామృతాసారశీ
కరశాంతాఖిలతాపసంతతులమై కాలుష్యముం బాసి నీ
దరహాసామలచంద్రచంద్రికల సత్యక్రీడతో నుండ ని
ష్ఠురతన్ మమ్ముఁ బాయఁ బాడియె జగత్కల్యాణసంధాయకా!

3 గోపి-శా. వైరాగ్యామలవృత్తిలేదు విలసద్భక్తిప్రభాయోగ మే
పారఁగ లేదిటు శాంతిదాంతిగుణసద్భావంబు రానేర దీ
నారీజన్మము హేయమౌ మునివరుల్ సవ్యప్రబోధంబునన్
జేరఁగ రానిపదంబు కోరుటలు మా స్త్రీచాపలం బీశ్వరా.

4 గోపి-చ. జగములు తానెపెంచి భవసాగరదుఃఖతరంగమాలికన్
వగగనఁ జేసి పూర్వకృతపాపఫలంబునిను సత్కృపాను
గతవిభావమెక్కడిది నూతనవంచక వేఁటకానికిన్
వగచుమయారె భావ్యముల పాపమటం చని జాలికల్గునే.

5 గోపి-చ. పురుషులకే దయారసము పుట్టదు నెమ్మదికర్కశంబనన్
పురుషవరేణ్యుఁడీవు కృపఁబూనగ నేర్తువె యాశ్రితావళిన్
పరమనోవ్యథన్ వగలపాలొనరింతువు, పాపిబృందమున్
శిరులనొసంగఁజూతువు విశేషవిరుద్ధుఁడ వీవు మాధవా.

శ్రీకృష్ణ—కలవాణులారా! నాస్వరూపము మీహృదయసీమయందు తప్పనేరదు. మన్మూర్తిదర్శన పూజనసంసేవనంబులు మీ కెన్నటికినిఁ దప్పనేరవు. అదెట్లన్న వినుఁడు.

చ. తరుణుల పుణ్యరూపము, పవిత్రపరికరాంచిత సిద్ధరూపమున్
సురుచిరభక్తిభాగ్యపరిశోభితరూపము, పుణ్యతీర్థసం
స్ఫురదురురూప మాగమవిబోధితరూపము దేవరూపమున్
తిరముగ మోక్షరూపము పతివ్రతలందులభర్తృరూపమున్.

చ. పతికెదురేగుచో రుచిరపాద్యమొసంగుచొ పీఠనిల్పుచో
అతిశయభక్తితో జలకమాడఁగఁజేయుచొ పూజసల్పుచో
మతికమలాసనస్థితిసమంచితరూపము నెన్నుచొప్పునా
కతులసపర్యఁజేయుటయె యన్యము కాదది బుద్ధిమానుఁడ.

1 గోపిక—దేవాధిదేవా! చరాచరములు నీవయై వెలుగొందుచున్న వాఁడవయ్యును అజ్ఞానావృతచేతస్కులమై భవదీయమూర్తి

సందర్శనవిరహమును సహింపఁజాలకున్నారము. మాయా మయుఁడవైన నీసురుచిరమాయచే సరసీజాసనాదిమహా దేవతలు మోహితులై కడతేరఁజాలకున్నారఁట, మే మెం తెంతటివారము ? నీ వెట్లును భక్తరంక్షణమునకై, భక్తశతు్రు రక్షణమునకై, భక్తకామినీరక్షణమునకై, భక్త పౌరజనరక్షణ మునకై, వెడలఁదలంచియున్నాఁడవు. పోడసూపనెంచి యు న్నాఁడవు. నిన్ను వద్దనఁజాలము. కావున పోయిరమ్ము. సర్వ శుభములతో మరల గోకులమును జేరుము. భవత్పునర్దర్శన ము, సుజ్ఞానదర్శనము, సుజనయోగదర్శనము, పరమతారక దర్శనము, మోక్షాధిరాజ్యదర్శనము శీఘ్రకాలమున నొసఁ గుము. అక్రూరా! నిన్ను మే మెంతయు నిందింపవలసియున్న ను స్త్రీచాపలమును మాని, పరమార్థదర్శనమూని, నిన్ను వేఁడువారము. ఎటుల మాకృష్ణుని సుఖముగఁ గొనిపోయెద వో, యెటుల మాగోపాలునకు నావంతయైన వంతగలుగనీ యక మధురాపురిఁ జేర్చి మధురకార్యసమారంభఫలమును జేకూర్చి మాకప్పగించెదవో, యెటుల మా పొగడికోలు వడసెదవో? వాసుదేవా! ఇదియే భవదీయ చరణారవిందము లకు నమస్కరించువారము.

(అందఱు నమస్కరింతురు.)

శ్రీకృష్ణ—గోపికామణులారా ! మీ భక్తికి మెచ్చితి. మీ రెప్పుడు నెందు, యెటులతలఁచెదరో అటుల నాదివ్యతరస్వరూపము మీమానసవీథులందు తప్పక యుండుగాక! అక్రూరా! ప్రొ ద్దయినది. వెళ్లుదము రమ్ము.

(నిష్క్రమము.)

---

పంచమాంకము—తృతీయరంగము.
మధురాపట్టణము—రాజనగరు.
[కంసుఁడుండును.]

కంస—ఔరా! నేఁడేలనో నాకారాటము కలుగుచున్నది. మనంబు నసే కలయుంధైన నెఱుఁగని భీతికలుగుచున్నది. అనవరతము పాపగతుని నాగోపాలహతకుని స్మరించుచుండుటచేత నాకిట్టి మతి భ్రమకలిగియుండునా?

మ. మనమారాటముఁ జెందె, భీతికలిగెన్ మాంద్యంబుపైఁ గప్పె లో
నను ధైర్యంబుతొలంగె, లోకమును శూన్యంబౌ మఁ గాన్పించెనా
ఘనమా శక్తియుఁదగ్గె నేమిగతమో కంసుండఁగానో మహా
వనటల్ గల్గెడినేమొ కృష్ణుఁ డరినై బాధించునో నక్కటా.

[ప్రవేశము:—అక్రూరుఁడు.]

అక్రూర—కంసరాజేంద్రా! తమయానతి మేఱకు బలరామకృష్ణులఁ దోడ్తెచ్చియున్నాను.

కంసు—సెబాస్ అక్రూరా! ఇప్పుడే వలయు. చూడ నిశ్చయ్యవ్వఁ గాల్చి రావలయు. వారి నాస్థానమునకుఁ దోడ్కొనిరమ్ము పొమ్ము.

అక్రూర—భాగ్యము.

(నిష్క్రమము.)

కంస—ఔరా! అక్రూరుఁడువచ్చి బలరామకృష్ణులఁ దోడ్తెచ్చితినని నంతనే నాకాలుసేతులు గడగడవణఁకఁ జొచ్చె. అయ్యో! నేఁడేల నాకీపిఱికితనము గలిగె? దుర్వారప్రతిపక్షగంధసింధురకుంభస్థలములచీల్చి యూణిముత్తియములను రాలచ్చినకిఁ దలబ్రాలుపోయఁజాలు నీవీరశిఖామణికి శాత్రవుఁడదు రే తెంచిన నీకాండిశీకత్వ మెక్కడనుండి వచ్చెను? హృదయమా! హృదయాంతరాళనిమగ్న చండవిక్రమక్రమమా! ఏల

నీవిజృంభణముఁ జూపక చల్లపడి యెదవు? రమ్ము నాయందు ప్రకాశింపుము. వీరవర్గనిందనీయము గు తుచ్ఛభయమా! అట్టి యీకంసుని నుండి వెడలిపొమ్ము. కరవాలమా! అరిమూలాకంధరపరిహరణకాలమా! నీవొక్కఁడవు నాహస్తమునందు పదిలముగా నిలువుము. ఔరా! నేనెట్టి వెకలినైతిని? నామిత్రులగు జరాసంధాదులసహాయము నపేక్షింపక కృత్రిమోపాయమున కార్యము సాధింప నుకట్టితినే? ఈబాలుఁడు నిక్కముగా నామారణకృత్యమునకై భూమి నవతరించిన యాహరియే యై యుండవచ్చునా? కానిమ్ము. వానిసామర్థ్యముఁ జూచెదగాక.

(నిష్క్రమణము.)

---

పంచమాంకము—తురీయరంగము.

మధురాపట్టణము-రాజాస్థానము.

[కంసుఁడు, మంత్రులు, సేవకులు మొదలగువారుందురు]

కంస—మంత్రిపుంగవులారా! ఇంతటితోనే యాగోపాలుఁడు వీరాగ్రేసరుఁడని మీరు జంకరాదు. కువలయాపీడమను గజమును సంహరించెనని గదా మీరింత భయపడసాగితిరి? ఆయేనుఁగు కడుంగడు ముసలిది. నేఁడో రేపో చావనైయుండెను. అట్టిదానిని వధించు టొక్కయబ్బురమా! అదియుగాక యీమాయానాటకుఁడగు కృష్ణున కేదియో మంత్రమన్యౌషధీప్రభావముండవచ్చును. దానికయ్యే నేను చాణూరముష్టికాసురులను బంపియున్నాఁడను. ఇంకొక క్షణమునకు నాశత్రువుమృతుఁడయ్యెనను వార్త చల్లఁగ వీనులార విని సంతసింతముగాక!

లంబ—నాకేమో ప్రకృతము వానితో సంధి చేసి కొనుటయే యెంతయు భావ్యమని తోచుచున్నది. వాఁడొక్కఁడే బాలుండు చూచిన సురాధిపతినయిన భ్రమందఁజేయు కువలయాపీడ ద్విరదరాజమును చంపుటయున్న సమస్తలోకముల జూపు ననుటయే.

ఉష్ట్రి—వాఁడు సంవర్తకాల సంరాజన్మధ్యందినమార్తాండుఁడు అస్మదీయ దానవకాలాహుల వేళార్ప నిలాతలమున జనించిన పన్నగవైరి. వానితోడ వైరమే వలదని తోచుచున్నది.

[ప్రవేశము: శీఘ్రయానమున నొకసేవకుఁడు.]

సేవక—రాజేంద్రా! కాపాడుము; కాపాడుము. మృత్యుముఖము నుండి మమ్ములఁ దప్పింపుము.

కంస—సేవకా! ఏమి? యేమి? ఏమి మీ యాగడము? నీకు గలిగిన యాపదయైన నేమి? వచింపుము.

సేవక—దేవా! ఏమి చెప్పుదును? అయ్యో! అయ్యో! ఇంకేమిగతి?

కంస—(కోపముతో) సేవకాధమా! సత్వరముగ వచింపుము. ఏల యాలశ్యము సేర్చెదవు?

సేవక—(వణకుచు) అయ్యో! యేమి చెప్పుదును? మన చాణూర ముష్టికాసురులు—

కంస—వారికేమైనది? వారెందున్నారు?

సేవ—అబ్బా! ఏమి చెప్పుదును? వారు గోపాలకృష్ణుని బారికిబడి నీల్గిరి.

కంస—ఔనా? ఔనా? నిజమా? చాణూర ముష్టికులు చచ్చిరా?

(మంత్రులు మొదలగువారు భయము నభినయింతురు)

దానవనాయకులారా! మీరేమియు భయపడకుడు, ఇంక

వాఁడెందు పోవఁగలఁడు ? భీకరకంఠీరవము నెదుర్కొను మృగశాఖంబు వగిది, ఆకొన్న శార్దూలమును మార్కొన్న మేషకిశోరంబురీతి వాఁడు నాకుఁ దొలియుద్ధ కాఁగలఁడు. రానిండు. మద్భుజారాహురసనాగ్రమునకు వాని ప్రాణచంద్రుని నాహారంబు గావించెద.

[ప్రవేశము:—శ్రీకృష్ణుఁడు.]

శ్రీకృష్ణ—మామా! మీ కల్లుఁడై, రేపల్లెయందు పెరుగుచున్న బాలుఁడై యున్న గోపాలకృష్ణుఁడు నమస్కరించుచున్నాఁడు.

(అని నమస్కరించును.)

కంస—ఓరీ! నాకల్లుఁ డగుటకు నీకుట్టిపిటికి కంద తగునా? వెన్న దొంగా! నీవేనా రేపల్లెయందింటింట పాలు, పెరుగు దొంగిలించుచు, ఆడవాండ్రను గాంచిన దుష్టతన మొనర్చుచు, వారి చీరల నపహరించుచుండిన పాపకర్ముండవు? అధమా! వారు నాయొద్ద మొఱఁబెట్టుకొని యున్నారు. అందుకై నినుఁ బిలిపించితి. ఇపుడు నీవు నీ దపరాధి వనుకొనుము గాని నామేనల్లుఁ డవనుకొనకుము. పాపకార్యము లొనర్చినవాఁ డల్లుఁ డయినను సరియే, గొల్లవాఁడయినను సరియే. వానిని వధింపనేవలయు.

శ్రీకృష్ణ—మామా! ఏమి నీన్యాయము! ఏమి నీధర్మము! ఏమి నీ రాజ్యపరిపాలనము! నీసమానపాండిత్యము గొల్లవారి కెక్కడ రావలయు? వచ్చిన యల్లుండ్రకు మేనమామ ప్రేమాలింగనమో, కుశలసంభాషణమో, పరమాదరణమో చేయుట మాని కినుక గదిరిన కనుదామరలరక్తము గ్రక్కుచు మాటాడఁబోలునే?

మ. పలుకో, పామరమో, మహాదరణమో పక్వాన్నముల్ పెట్టుటో
వలువల్ కట్టుటొ, సేమవార్త వినుటో, బాంధవ్యముగఁ బెంచుటో
యిలమర్యాదలు మేనమామలకు తా మే తేరవల్లుండ్రి నా
శలుపోవఁగ మదికోపగింతురె మనీమఁగ కంసభూపాలకా.

కంస—ఓరీ! నీవల్లుడవగుదువా? నీకు మర్యాద కావలయునా? మత్కరవాలనిశితధారాకాలభుజంగమునకు నీప్రాణవాయువు లర్పించుటయే నాకు నీయెడ చేయదగిన మర్యాద. వెన్న దొంగవు నీకేల మానమర్యాదలు?

శ్రీకృష్ణ—మామా! ఆ వెన్నను నీవు చూచియెఱుంగవు. ఆ వెన్న నీకును నీసదృశులగు వారికిని పొంద నసాధ్యమైనది. జరామరణముల గలిగించనిది. సనకసనందనాదులకును పొందనసాధ్యమైనది. వేదవేదాంతములకైన కానరానిది మద్భక్తులకు మాత్రము పొందదగినది

సీ॥ పెరుగుచిలుకుటలేక పెరుగుచుండెడివెన్న
అగ్నిలోఁ గరుగక నలరువెన్న
ధనమదాంధులు పొందలేక వెలిగెడివెన్న
కాపీనధనులకు కలుగువెన్న
పాడిపంటలు లేక పరగుచుండెడివెన్న
క్షీరసాగరమందు చెలగువెన్న
భుజియింప క్షీణమై పోవకుండెడివెన్న
కేలనంటగరాక గ్రాలువెన్న

గీ. ఎంతకష్టించినను చిక్క కెనయువెన్న
లీలభవరోగముల పారదోలువెన్న
చూడరానట్టి వెన్న నగఁ జూచువెన్న
కాంచదుర్లభ మావెన్న కంసమామా!

కంస—బాలకాధమా! సురాసురులు మదీయభ్రూసంచలనమున సంచలించుచుందురు. అట్టి నాయెదుట నిర్భయుండవై, నిశ్శంకుండవై, నిర్లజ్జుండవై సంభాషించుచున్నాఁడవే? మత్తగజేంద్రము పిపీలికగణముభంగి నిన్నొకనఖాగ్రముననణఁపజాలనా? నీ వేశక్తినినమ్మి నన్నెదిరించెదవు?

శ్రీకృష్ణ—నాశక్తియా? వినుము.

మ॥ వరసృష్టిస్థితినాశశక్తి, భువనవ్యామోహనాశక్తి, శ్రీ
కరభక్తావనశక్తి, బ్రహ్మహరసాహాయ్యాద్రిశసంశక్తి, ని
ఖరఖద్గోళ్లసదాదిశక్తి, ఘనమోక్షుద్వ్యారచిచ్ఛక్తి, భా
స్కరసోమాంచితశక్తి, నాకు నదియే సైదోడు భూపాలకా.

కంస—బాలకా! నీకై పూతనను బంపితిని. అదిచిరకాలరోగార్తయై నశించి నిన్నుఁజూడఁగనే ప్రాణంబులవాసె తృణావర్త శకటాసురాదు లన్ననో ముదుసలులైనందున నీచేఁజంపఁబడిరి ఇంతకే యింతగర్వమా?

సీసమాలిక.

కంస—హీనపూతనఁజంపినాననిపొంగకు
చాలత్రాళ్ళచెగట్టి చంపివైతు

శ్రీకృష్ణ—భక్తిత్రాళ్ళచె కట్టబడుదునెగాని నీ
బంధముల్ ననుఁగట్టి వైవఁగలవె

కంస—జలరాసినుంచి నీకు బిలుకుమార్చెద కృష్ణ
చచ్చితి విందెందు చనఁగ గలవు?

శ్రీకృష్ణ—జలరాసి మాయిల్లు, జలరాసి మామామ
ఆయబ్ధి నన్నేమిచేయు గలదు?

కంస—నీయూప మణఁగించి నీగుణంబులమార్చి
మదినున్న చింతల మాను వాఁడ

శ్రీకృష్ణ—రూపమే లేదు నారూపుమాపెద వెట్లు
ఓమామ నీచింత యుండదింక

కంస—కొండక్రిందనువైచి దండించి, ఖండించి
పరలోకసుఖముల నరయువాఁడ

శ్రీకృ—కొండక్రిందనె నేను నుందును నోమామ
పరలోకసుఖమె నీకరయునిత్తు

కంస—గీ. ఎందుదాగితి వోకృష్ణ నీ విన్నినాళ్ళు
నిపుడు వచ్చితి నాకార్య మెల్లదీర

శ్రీకృష్ణ—నీదుమదిలోన నుంటి నే నిన్నినాళ్లు
ఆర్తి యేటికి నీపనిఁదీర్తుమామ.

కంస—బాలుఁడవు నీవు నాకు మారకుఁడవౌదువని కొందఱువచించిరి. అది యజ్ఞానవిజృంభితముగాని వేరుకాదు. నీవనఁగ నేమి? నన్ననఁగ నేమి? సంహరింతువనఁగ నేమి?

ఉ. గోకులమందు నిన్ను మృతిఁగొల్పఁగ బాలకుఁ డొక్కరుండు ని
న్నాకొనియున్న బెబ్బులివిధంబున నంతకురీతినియున్నఁవాఁ డనన్
వ్యాకులమందితిన్ గనఁగ బాలుఁడవీ విటు నన్వధింపుదే
ప్రాకటదంతఘట్టనల ప్రాణములన్ హరియింతు చూడుమా.

శ్రీకృష్ణ—దానవా! నీవు నాకు మేనమామవయ్యును దానవకృత్యములఁ జేయుటచే "దానవా" యని సంబోధించెద. నిన్నొకఁడేల చంపవలయు? దినదినము నీవొనర్చు నీచతరపాపకార్యములే నిన్ను దహింప నేతెంచుచున్నవి.

ఉ. చంపఁగ లేదు మృత్యువది చంపఁగ లేదు పరేతనాథుఁడున్
చంపఁగ లేరు బ్రహ్మ హరి శంకరు లాసురసిద్ధసాధ్యులున్
చంపఁగజాల వెవ్వియును సర్వవిధంబుల నీదుకర్మమే
చంపును నిన్ను నందుకు విచార మదేటికి కంసభూవరా.

చ. చెలియలి(జం)పుపాపము, ద్విజేంద్రుల బాధలఁ జేయుపాప మా
పలువుర పాపల ద్రుంచుపాపము యజ్ఞములార్చుపాప మా
చెలువలబట్టుపాపము, విశిష్టులహింసయొనర్చు పాపముల్
కలఁగక నిన్నుజంపు నది గాంచెద విప్పుడె తత్ఫలంబునన్.

కంస—బాలకా! నిన్నుఁజూడ నాకేటికో కరుణగలుగుచున్నది. నీవు పసిబాలుడవు. నిన్ను జంపుటవా, వలదాయని సందియముకలుగుచున్నది. ప్రథమాపరాధముగావున మన్నింతునాయని యూహయు జనించుచున్నది. నీవెవ్వఁడవు? ఎచ్చటనుండి వచ్చితివి? ఎట్లువచ్చితివి? చెప్పుము.

శ్రీకృష్ణ—కంసా! ఏమి నాకు నీకూతురునిచ్చి వివాహమొనర్చెదవా? నా బాంధవ్యమేల నీకు? అప్పుడల్లుఁడు కానఁటివి. ఇప్పుడు కావలసివచ్చెనా?

కంస—బాలకా! ఇంక నిన్నుపేక్షింపఁ జాల.

(అనుబంధము 45)

శ్రీకృష్ణ—కానిమ్ము. భవాదృశ పాపనిచయకంటక ముక్తమై యీ వసుధ సుఖించునట్టులఁ జేసెద. ఇఁకమనినన్నాళ్లు మనజాలవు. ఇదె నీమనుగడకంత్యముకలుగును. అంతట పరికింపుము.

కంస—(దిక్కులు చూచి) ఆహా! ఇయ్యది యేమిమాయయో కానరాదుగదా? నిజవీక్షణ పరంపరల శత్రువాహినీసందోహంబులు మొదలంటగాల్చి మదీయరూపము శత్రునారీజలంబుల కన్నులగట్టెడు. నే నెదిక్కుఁజూచిన, నేవస్తువుపరికించిన, నెందులఁ గాంచిన కృష్ణమయమై కన్పించుచున్నది.

ఉ. ధరణిన్, వ్యోమమునం, దిశావితతినే తద్రాజసౌధంబులన్
గిరులన్, దివ్యతరంగిణీచయములన్, కీలాబ్జమ్ములన్; శాలలన్

తరుల స్నాధుల వస్తుజాతముల మద్వైరికి కృష్ణు నేగాంచెదర్
అరరే చోద్యపుమంత్రివేత్త యిఁక డాహామోనము మ్యోగ్గదా.

అకటా! సత్యముదూలె, మేను వణఁకఁజొచ్చె. కృష్ణా! కృష్ణా! రాకుము. రాకుము! మేనమామనే? భళిరే వచ్చితి వా! కాపాడుము. కాపాడుము. దేవకీదేవీ! నీవైన నీయన్నయందు కరుణింపుము.

శ్రీకృష్ణ—గమ్ము. నీ కిఁక శాశ్వతసుఖ మొనఁగెదను (అని యెగురేగి కంసుని క్రిందబడవైచును.)

[ప్రవేశము—నారదుఁడు యోగమాయ, బ్రహ్మ,
ఇంద్రుఁడు మొదలగువారు ]

ఇంద్ర—దేవా! లోకములు చల్లనయ్యె. నీదయావలోకమున గృతార్థులమైతిమి.

బ్రహ్మ—గోవిందా! నీకృపారస మింతని కొనియాడవలయు? భక్తులకై యవతరించి లీలామానుషుఁడవై లోక కంటకులఁ బరిమార్చితివి.

మాయ—గోపాలా! నీయాజ్ఞానుసారమున కాళి, పాలి మొదలగు రూపములఁ దాల్చి నీదగ్గనమున్నకై వేచియుంటిని. పరమపురుషుఁడవైన నిన్ను గాంచగల్గె. తమయానతిచే శుద్ధ మాయా రూపిణియగు నాదిశక్తి, లక్ష్మీదేవి భీష్మపుత్రియందు రుక్మిణీ నామమున జనియించి యున్నది.

నారద—దేవాదిదేవా! పుండరీకాక్షా! నాచామగోచరుండవగు నిన్ను గాంచగల్గె. ధన్యులమైతిమి, కృతార్థులమైతిమి.

యోగ—సీ దండంబు బ్రహ్మాండ పుండరీకకరండ
మండిత నాభీప్రభాండ నీకు

బ్రహ్మ—జోహారు వైదేహ భాహారిహృద్గేహ సా
హార్ధవర్తనోత్సాహ నీకు

నారద — వందనం బరుణేందు సుందరేక్షణబృంద
నందితహరిశతానంద నీకు

ఇంద్ర — జేజే బుధాజీవ రాజీఘనాజీవ
రాజితవారిదరాజి నీకు

నారద-గీ. ప్రణతి నికురంబములు దివ్యభాస నీకు
వరమసాష్టాంగములు చక్రపాణి నీకు
నిరుపమాంజలులు పరమపురుష నీకు
వరనమస్కారములు గోపబాల నీకు.

[ప్రవేశము:- దేవకీవసుదేవులతో నక్రూరుఁడు]

దేవకి — (కుమారు నాలింగనముఁ జేసికొని) కృష్ణా! కృష్ణా! ఎన్నిదినములకు నిన్నుఁ గాంచగల్గితిమి? ఎంత కాలమునకు "తనయా" యని సంబోధింప గలిగితిమి? ఈదినమేకదా సుదినము? అన్నా! గోకులబాలా! నీతల్లిని గంటివా?

శా. అన్నా గోకులబాల మామక తపస్సామోదలీలా నినున్
కన్నారన్ కనుగొంటి నేఁడు మదిసత్కాంతౌఘంబబ్బెగా
ఎన్నాళ్ళయెను నిన్నుఁ గానక కృపాహీనాత్మనై త్రోసితిన్
అన్నా! నీజననిన్ క్షమింపవె దయాహాసంబునన్ బ్రోవవే.

వసుదేవ — తనయా! నినుఁ గాంచు కుతూహలముననే చెఱసాలయందు కనరాని కష్టములొందియైన జీవింపఁగంటిని. రేపల్లెయందు నీకుశలవార్తలవిని యెపుడు నినుఁ గాంతుమో యని దినమొక్కయుగముగాఁ గడుపుచుంటిమి. నేఁడు నీదివ్యరూపము కంటిమి. మావంశభూషణము గంటిమి.

ఉ. కంటిమి భాగ్యకల్పకము కంటిమి పున్నెముప్రోవు నిమ్ముగా
కంటిమి వంశభూషణము కంటిమి కామితకామధేనువున్

కంటిమి మానిధానమును కంటిమి మాదగు ముద్దుకృష్ణునిన్
కంటిమి జన్మపావనత కల్మషనాశన కంజలోచనా.

శ్రీకృష్ణ—జననీజనకులారా! నాకొఱకై యెంతయో శ్రమించితిరి. నాకొఱకై కష్టనిష్ఠురముల బడితిరి. అకటా! ఇంతవఱకు మిమ్ముల గాంచ నేరకపోతిని. నాతల్లిదండ్రుల నేఁడు గాంచగంటి. అమ్మరో! హతభాగ్యుఁడగు నన్ను నందనునిగా బడయుటచే నెంత దరిలేని దుఃఖసముద్రమున మునిఁగితివిగదా ?

సీ. హతభాగ్యుఁడగు నాదు కతమున కడలేని
కష్టములఁ దాఁకఁ గంటివమ్మ
జనకుల సంతాపములఁ జేసిన క్రూరు
కొమరుఁ జూడగ నేల కోరితమ్మ
తండ్రులఁగాక నాతమ్ముల హింసించు
కలుషుని నన్నేల గంటివమ్మ
అమ్మరో! యిన్నాళ్ళు నెమ్మితల్లినిఁ జూచు
భాగ్యహీనత యుండ వలసెనమ్మ

గీ. కన్నతల్లిని నేను నేకంటినమ్మ
కనులకెంతయు పండువు కలిగెనమ్మ
ఘనత నాకోర్కె ఫలియింప గంటివమ్మ
జనని నన్నింక పాలించి పెనుపుమమ్మా.

(అని తల్లిదండ్రులకు నమస్కరించును.)

నారద—బ్రహ్మాదులారా! ఇట్టి సంతోష సమయమున నీదేవదేవుని, గోవిందుని, నందనందనుని స్తోత్రమొనర్చుచు మంగళము పాడుదము. (అనుబంధము. 46)

మంగళము.



# అనుబంధములు.



1. కాపిరాగము—రూపకతాళము.

అందఱు॥ వనధిశాయన-మాధవా-ఘనా-ఘనా-ఘనా
భవరశీల-శ్రుతివిలోల-జలజలోచనా
వరదా-నా-రా-యా-ణా-భక్తపాలనా॥ వనధి॥

2 బేహాగురాగము- ఆదితాళము.

భూదేవి—ఆలించి పాలింపవే- నామొఱ
ఈలోకముల్ బ్రోవవె-ముకుంద-ముకుంద॥ ఆలించి॥

పాపులచే నతి- బాధలంజెందితి
ప్రాపిచ్చి రక్షింపవే-ఏపారగా నను
కాపాడవే-వర-సద్భక్త సంరక్షణా॥ ఆలించి॥

(3) 1-వ పాటయే

4. శంకరాభరణరాగము - రూపకతాళము.

అందఱు—సంత-సంబు-నెంతో-నిండెగా
మదిలోననూ-భాసురగతి-కరమరుదుగ॥ సంత॥

బ్రాహ్మ—శ్రీ-నా-థుం-డుల్-బ్రోచుల్-మిమ్ముల్॥ సంత॥

ఉగ్ర—దేవకి-నీపతి-తోడను-దీపిత-మోదమునందుము॥ సంత॥

వసు—కాంతా-యీధరణిని-ఎంతో- వరయశముల్ సంతో- షము
వెలుగుల్-ఘనతన్-సతిగ-నతివ-నినునె-గను టను॥ సంత॥

దేవకి—మేలాయె-నినుపతిగను నేగాంచిన్-నిరతము నినుసేవింతున్
ఘనకరుణను పాలింపు-సారశుభం-బారయుచున్-ధీరమ
తిన్ బ్రోచు మమ్మున్-సరసిజనయనుండు నెపుడును॥ సంత॥

కంస—అమ్మా రమ్మా-యశమునుచేకొమ్మా,-కొమ్మా నమ్మా-
దము నిటుగైకొమ్మా - పొమ్మా పొమ్మా - తనయునితో
రమ్మా-నీపతితో- దీపితమా - పతివ్రతావ్రభావము నిత్యం
బును గైకొమ్మా॥ నంత॥

5 ఇంగ్లీషునోటు—ఏకతాళము.

సైనికులు—చనుడండమార-సురల్ వెండుబార-ధర యేపుమీర
అరుల్ దారిపార-మహాధీరులారా-మదిశూరత మీరగ-
తారలు-వ్రేలంగ-ధారుణిసోలంగ వీరులారా॥ చను॥

చంద్రుడా యుపేంద్రుడా-మహేంద్రుడే దివిజ
నొంచి-వధించి-దుంచి-సంచ-రింపుడీ-కంసనామము
వినిన-కనిన-జగములెల్ల-తల్లడిల్లగా॥ చను॥

6-7 బేహాగ్ రాగము—పంజాబితాళము.

నార—సురవరనుతచరణా-స్వరమణా
కరివరా వనా-సరసిజనయనా
ధరణి ధరోద్ధరణా- విగమనా॥ సుర॥

మత్స్యకూర్మ-కిటినృసింహా-మాణవకభూభృద్ద్విరామ
దానవారి-రామచంద్ర-దీనావనభరణా॥ సుర॥

8. ధీరశంకరాభరణరాగము.—అటతాళము.

నారద—జయజయ-కంసరాజేంద్రా-జగన్నుతకీర్తి-గుణసాంద్రా
జగన్నుతకీర్తి-గుణసాంద్ర-జగన్నుతకీర్తిగుణసాంద్రా
దురసద-శౌర్యసమవర్తి-ధరాధరధైర్య-కిస్ఫూర్తి॥ జయ॥

9 బిళహరిరాగము—ఏకతాళము.

కంస — కానవా - నారదా - నాశక్తి - నాయుక్తి - నావ్యక్తి - నారక్తి॥
కానవా॥

జగంబులన్ - తలంగక - చేయుటెఱుఁగవే
యేటికి - మాటలు - మాటికి - భీతియు - లేకటు - బల్కితి
జ్ఞానము చేటుగ॥ కానవా॥

(10) 8 వ పాటయే.

11 ఇంగ్లీషునోటు - ఆదితాళము.

కంస — ఇదె వెళ్ళెదన్ - ఇలనొంచెదన్ - చెండాడెదన్ - అరివరమున్ - విష్ణున్ గిష్ణున్ - భ్రష్టున్ జేతున్ - రుద్రుని - నిద్రున్ - గావింతున్॥ యిదె॥

యశంబెల్లన్ - వెసన్ మీరన్ - సుల్ పారన్ - ధరన్ మీరన్
భూరిత్రివిక్రమ - విక్రమ మొప్పగ - రాక్రమలక్ష్మిని - నొందెదను॥

12, జంఝూటి రాగము - ఏకతాళము.

వసు — వనమెంత - వింత - సంతతంబు - నించెగాదె - నీరేజనేత్రి॥ వన॥

దేవకి — సురసాలసాల - నారికేళముల్ - మీరెను నాథా॥ సుర॥

వసు — అరవిం - దము లం - దులవిం - దగతు - మ్మెదలున్

దేవకి — మదియుందమున్ - కొందురందగన్ - మధుబిందులన్
తగగ్రోలుగ॥ సుర॥

వసు — కాసారముల్ - కసాటెతన్ - ధీరంబులై - రాజిల్లెగా

దేవకి — శుకపికంబులున్ - సురుచిరంబులై - వరరుతంబులన్ - ధర
చెన్నారెగా.

కదళీ-దళలీ-నమునా-కపురంబల రెను గద ॥సుర॥

వసు—సుమ సముదయము లు నెల్లందుఁ - ప్రియుదమున మరగ న
వ్వేళఁ - వసుర భతతన రేఁగా - సరసిజముఖగను ఘన
రీతిఁ
జలనుల్-గిరులఁ-కరకన్-కలికీకలు తెలుగుల ॥వన॥

13 సారంగరాగము-ఆదితాళము.

కంస—వదలనే చంపక పగతుఁ
కరుణాకలపక - కాంతివిడక - వంతగనక - నొంచన - చెల్లి
యలైననే-మల్లనశాస్త్రవుఁ - డుల్లసమూరగపుట్టడే - ఉల్లము
నందుల -నొల్లకుపేర్మిను-తల్లడ మొందఁగఁ జేయనే-బాయనే
దేవకి॥వదల॥

14 కమాజురాగము ఆదితాళము.

దేవకి—నన్ను నేలవే-అన్నా కృపచేత
కన్నారనన్ను-మన్నించియింక-యిన్నాతిచూచి ॥నన్ను॥
చెల్లెలినిచంపగనిటు నల్లంబునొప్పనా న - ఉల్లాసమంతబో-
కల్లలనమ్మవంత-పెల్లొందఁజేయకు॥ నన్ను॥

వసు—చెన్నార ప్రేమను-సంపన్నారవింద నేత్రి
చిన్నారిసోదరి-నీవెన్నంగ-చంపయిటు-అన్నాతగవాన॥ చెన్నార॥

15 ధన్యాసిరాగము అటచాపుతాళము.

దేవకి—కరుణాత్ముఁడిల కలరే-అరసి బ్రోచు వారలేర
చెరసాలబడి శోకా-కరులైతి మకటకటా ॥కరు॥
కంసుఁడుకుల పాంసనుఁడయి-కన్న పుత్రులఁజంపినయ్యో
వంశనాశనమయ్యె నాహా-వంశాకర నీరజాక్ష ॥కరు॥
తొలిజన్మమున నేను-బాలురి దటీ జఁపిమెంతో
కలుషకృత్యముఁ జేసినానో-అపాపము మానసాన ॥కరు॥

16 లావణి

గోపాల-బాలసుర-లాలనలోల-కృపాకర-సద్గుణలీలా-
గుణశీలపాల - మునిజాలహృదుజ్వల - సుందర - భాస్వర
ఫాలాగోవింద-గోవింద ॥౧॥

గోవిందనందవర-నందన-నందదమంద-విభందనబృందా-
బృందవనసుమ-రందబిందుచయ-సుందరచరణానందా-
ఆనందా-ఆనందా ॥౨॥

శ్రీనంగర-రంగ-విమలాంగ-సుభృంగ-సురంగదపాంగ-
తరంగా-తరంగ.రింగ-ధవళాంగ-భుజగమ-సంగిత
సుస్ఫురి-తాంగ-స్ఫురితాంగా-స్ఫురితాంగ ॥3॥

17 ఆనందభైరవిరాగము-అటచాపుతాళము.

దేవకి—వసు—బాలా మమ్మిటుబాసి చనదే- మరల నిన్నుగాంచగ
మాకుకలదే ॥బాల॥

పున్నమచందురు-బోలు నీమోమును యెన్నడు॥ గన నున్న
వారము- కన్నతండ్రిరో ముద్దుబాల ॥బాలా॥

సుకుమార మాభాగ్య - మకలంకమనియుండ-వికలరీతిని-
నకట నిన్నిటు-ప్రకటవనములందోలుటాయె ॥బాల॥

18 సారంగరాగము-అటతాళము.

అందఱు—శ్రీకంస-రాజచంద్రి-ధైర్యసాంద్ర ॥శ్రీకంస॥
లోకచక్ర-విక్రమాఢ్య-వక్రదేవ-దండధర
కరుణా-నతజనభరణ ॥శ్రీకంస॥
రాజరాజ- సార్వభౌమ- రాజమూడ- దివ్యప్రేమ- రమణాజ
నచయభరణా ॥శ్రీకంస॥

19. జంఝూటిరాగము–అటతాళము.

దేవకి—కావుకావు రాజేంద్రా
అలుకేల-కో ‖కావు‖
కనకోడలాగదా-కనికరంబు చూపుమా
తునుమఁగ-పాడియే ‖కావు‖

20. బెహాగ్ రాగము-ఏకతాళము.

కంస—చండశాసనుండ నేను-కపటవినక
పలుకవలదు-కినుక పొడమెక ‖చండ‖
అల్లుఁడైన చెల్లెలైన-పెల్లుశత్రులైనవారి
బిలుకుమార్చి-పలుకుమార్చి-కలతకోర్చి-నలచెదన్ ‖చండ

21. ఇంగ్లీషునోటు-ఏకతాళము.

కంస‖ పలువా-తులువా-నగవా-గనవా
తెగవేయుదు నిన్-పగదీరన్ ‖పలువా‖
కలుషంబడరన్-పలుకన్ దగునే ‖పలువా‖
వైరమొదవఁగ నిట్లాడన్- మీరి మదమును నణగింతున్-
నీదురుధిరము నింకింతన్-మేదినినిక పారింతున్ ‖పలువా‖

22. హిందూస్థాని భైరవి రాగము-రూపకతాళము.

కంస—ఇదేమిచిత్రమో-మహానుతాపమో
మదీయ్యశక్తిమూలెనో-వికారమో
చిన్నశిశువు-మిన్ను కెగసె-ఎన్నజాలనే
ఏమిసేతునో-శోకం-బాయెన్ ‖ఇదేమి‖

28. కమాజురాగము ఏకతాళము.

యశోద‖ రారగోకుల-సుందర రా రా-యిందిరవర రార
బిరబిర-యిందిరవర రార-బిరబిర-యదువీర ‖రార‖

వరగుణజాలా-సురుచిరఫాలా-సురసుతఘనలీలా
రారనందన-యదుకులబాలా-వరదగోపాలా
బిరబిర-వరదగోపాలా॥ రార॥

శుభ్రఖ్యాతిని-సుబ్రాహ్మణ్య-సుకవిని నేలుటకు-రాగదే-
సుక-విని-నేలుటకు-సుజనపోషణా-శుభకర రార
సరసిజముఖ రారా-బిరబిరా॥ ॥రార॥

24. మధ్యమావతి రాగము - ఏకతాళము.

యశోద—జో జో జో-ముద్దులగోకులబాల
జో జో జో-సురుచిరఘనశీల॥ జో॥

లాలిసద్గుణ - మణిగణజాల - ఇందిరాముఖ - పంకజలోల
సుందరాంచితా- శశినిభఫాలా- ధీరమునీశ్వర - సముదయ
ఫాలా॥ జో॥

సుగ్రీవాభయము - నొసంగినరామ - ఆవాలిని మదమణచిన
రామ॥ సుగ్రీవా॥

వానరసేనలుజలధినిఁజేరి-వాసిగసేతువుగట్టఁగమీరర
పూని వేడినగరువముమీర-సాగరమంతయుపొంగుచుమీరె॥

25. బేహాగ్ రాగము - ఏకతాళము.

శ్రీకృష్ణ—లక్ష్మణా - ధనువునిటు-కొనితెమ్మా
దివ్యబాణములనీ-వందిమ్మా ॥లక్ష్మణా॥

జలధినినొంచెద-లలితశస్త్రముఁగొ - కొంకమఁకొనర్చెను-కరుణ
నుచూపక॥- కాలముతీరిన - దందిమ్మా-వీనికాలముతీరిన-దం
దిమ్మా॥ లక్ష్మణా॥

ఎంతనవేడిన - నెనరుమయ్యా గురు - వింతగ నిన్నకవేడుక
నల్పెదు - అంతయుచేతును - చేకొమ్మా - పిదినంతయుఁ జే
యుదు చేకొమ్మా॥ లక్ష్మణా॥

26 మోహనరాగము - అటతాళము.

ఉద్ధవ—గోపతనయ-సుగుణచయ
ప్రోపుము మ్మా-శుభ మెనయ
కోపమును గుణము నిలుచు-వరసదయ శ్రీ గోప॥

శ్రీకృష్ణ — లెమ్మాభయము వలదుగన-మోద మొదవుభ క్తి ఘన,
రామాడంచు తలచితివా జగదవన శ్రీ॥ లెమ్మా॥

27 నుదుకుల కాంభోజి రాగము - అట తాళము.

పూతన.—ఈజగముల నాపేర న్న-బెగడొందరె నన్నుగన్న
నగరములు నగములుకుగుల॥ ఈ॥
ధరణీ సురులువర-తరుణిజనులుధర-కరకర-
బనుచుచు-బరుగిడ వా-దృష్టిగన్న-నెట్టివారు
తట్టుకొను వారలే-పట్టివారి-నట్టిచంపు
నట్టిజగ-జెట్టినే నాదు॥ నీజగ॥

28. బేహాగ్ రాగము-అటతాళము.

పూతన—ననుఁజూడలోకు లు-ఘన మోహా-మును నొంద-లేరే
చేరరారే-వేడలేరే-పొందరారే॥ నను॥
కులుకుల-తళుకుల-బెళుకులగాంచి-హాగ్రమైన వేడడే
వాల్కంటిచూపుల-వలలోన జేరి-హారుఁడైన వేడడే
జను లెంతటివారలు ఆ-మును లెంతటివారలు ఆ-
ఘనమోహినినాదునుగా॥ నను॥

29. కాపిరాగము - ఏకతాళము,

యశోద—ముద్దాడ-గలుగునదియే గా
మోదభాగ్యా-మిలలోన॥ ముద్దాడ॥
చేరికుమారుల - చెలువము గాంచి-మీరిముఱిపెముల నించు-
కలుకులువినుచును - వరముదమునుగని - మురిచిర - తనయు
లనెంతో - పరమాదరణా॥ ముద్దాడ॥

30. బేహాగ్ రాగము - ఏకతాళము.

శ్రీకృష్ణ—భళి— నాలీలఁదెలియంగ-నెవ్వారలున్నారో॥ భళి॥
పసిబాలుండనై - బహువేసంబులన్ - వరనందాదులన్
వడినాడించుచున్ - నాటకమునాడుచును - లోకంబు
నేలుదున్ గదా॥ భళి॥

31. మోహనరాగము - ఏకతాళము.

యశోద—రమ్మా నాసుం-దరముద్దులకృష్ణా-చేరఁగ॥
వలపుల నించుచు-చెలువముగాంచుచు
వరలోకమోహాకరరోచనా॥ రమ్మా॥
తేనియలొలికెడు-తియ్యనిపలుకుల
మానకముద్దుల నొసఁగుచుతనయా॥ రమ్మా॥
మౌక్తికహారముల్-బొజ్జపై వెలయఁగ
ముఱిపెము పించెడి-రాజగోపాలా॥ రమ్మా॥

32 పీలురాగము - ఏకతాళము.

శ్రీకృష్ణ॥ అమ్మా[illegible]బంగారు-బండినాకియ్యవే॥ అమ్మ॥
బండిని నియ్యవే - గుఱ్ఱంబు నియ్యవే
బండిని నెక్కుదు-పసుగు నెక్కుదు-[illegible]-కు. క్లిక్లి
మెల్లంగ-మెల్లంగ, సర్-సర్-సర్-॥ అమ్మా॥

రంగారు అంగీలు-సొంపారు టోపీలు
ఇంపారవిల్లంది-యుద్ధంబుచేసేరు-కొట్టేను-ఫట్-ఫట్
వీరుడ-ధీరుండ-సై-సై-సై॥ అమ్మ॥

33 శ్రీరాగము - ఏకతాళము.

బాలురు—సంతసము-నిండారగా-బంతులాటలాడుదము
అదెబంతి కనుమింక-అతివేగవిడిచెదను॥ సంత॥

1 బాలుడు—అందఱు-కొనుడుదీని-కుందగజేసెద-చిటికలోన॥ సంత॥

ఉద్ధవ— చూడరాగరువమేల- చెండును పట్టెద-వేడుకలర॥ సంత॥

శ్రీకృష్ణ—వృక్షము ల్-తనర నెక్కి-వేడుకనాటల-నాడుదము॥ సంత॥

2 బాలక—కాతరం-బేలదాగి-గుఱ్ఱాతలనాడుద-మిందు జేరి॥ సంత॥

34 తోడిరాగము-అటతాళము.

శ్రీకృష్ణ—రారా-రాజునన్నైతి-లేరా
నన్నికనుసేవచేయఁగ రార॥ రారా॥
మీరిలోకమేలగా-ధీరతపుట్టినవాఁడరా
చెన్నుమీరనాడు-మన్ననంబునొంద-నెన్నిమీరలింక
నన్నుఁజేరియుండ-సన్నుతింపుడెల్లవేళ॥ రారా॥

బాలురు—దేవా-లోకాధిపాలుఁడ-ఏవ
వేదాంత వేద్యుఁడీవకావ॥ దేవ॥
దేవమార్గము నేలవా-మానుతెల్లను బ్రోవవా
నిన్ను నెన్నఁజాల—మన్న మమ్ముమాల-నమ్ముచేయులీల
లెన్న వేఁడువార-మన్న మమ్ముబ్రోవవేలా-గోపబాలా॥దేవ॥

35 బేహాగ్ రాగము-ఏకతాళము.

చంద—వైరంబుమీకింత-సేయుట తగదు
మాంద్రంబుచూపుట-మేలుకాదు॥ వైరంబు॥

కమల—సరివైరము మా కేమి లేదు లేదు
పద్మ—పట్టి నేరము మోపుట-సరి కాదు
చంద—అమ్మ నీవిట్లు-చేయరాదు
రక్తాక్షి—వీరిమాటల-నమ్మరాదు
పద్మ— } కమల— } భళీరే-బళిరే-భళీరే-భళిరే-నీమాట మెచ్చెనుగా
రక్తాక్షి—ముయ్ నోర్
చంద—ఛీ-పో వైరంబు॥
చంద—చంగావిపావడ-నే తెచ్చియిత్తుగా - బంగరు డియాలుచే యింతుగా॥ చంగావి॥
పద్మ— } కమల— } పుట్టువైరంబు మాకెట్లు-తప్పునుగా
రక్తాక్షి—గట్టిపొరకతో కొట్టినతప్పునుగ
చంద—మీతో కష్టంబు వచ్చిందిగా
రక్తాక్షి—తల కెక్కించు కొన్నావుగా
పద్మ— } కమల— } పోవే-పోవే-పోవే-పోవే-నీమాటసాగదుర
రక్తాక్షి—ముయ్ నోర్
చంద—ఛీ-పో వైరంబు

86 బేహాగ్ రాగము-ఏకతాళము.

శ్రీకృష్ణ—నను-నల్లుండు తనయుండు-నంచందరున్నారుగా
ఘనమోహంబు-పిం కి కల్పించితిగా
వెన్నపాల్మీగడల్-యెల్లవారిండ్లలో
వాసిగ నతిసిగ్గొని-కీడించి మీరుదుడుకు గద॥ నను॥

37 కాపిరాగము-ఏకతాళము.

యశోద॥ నిన్నింక సైరింపరా - తుంటరికృష్ణ॥ నిన్నింక॥

నీచోరతనముల - నీతుంటరితనముల-నన్నింపనికవిరాంద-
వినుము కనుము-మదినింక॥ నిన్నింక॥

తల్లిల్లు విడకినే-నెంతెంతో-యలసితి
నేమన్న విడనింక-తిట్టికొట్టి-కట్టివేతు॥ నిన్నింక॥

38 జంఝాటిరాగము-ఏకతాళము.

శ్రీకృష్ణ॥ అసత్యమీమాటలుకు-వినోదం బసత్యమీమాటలుకు
అమ్మరో-అబద్ధమేయగుగా-వినోదం॥ బసత్య॥
నన్నుదినను నే-నమ్మరో వెఱ్ఱినై-నన్నింపక వలదే
యశోదా॥ అసత్య॥
భూమికినాకును-పేర్మిమము నిక్కము-ఈ మాటెక్కడిదే-
యశోదా॥ అసత్య॥

39 శంకరాభరణము—ఏకతాళము.

యశోద—నిలునిలు బాలక-యెందులకటిగెను-కట్టెదనునినుకొట్టెదను
చిలగకుమా-కలగకుమా-పలుదోవలపా - రగనేలనుము
ద్దులకృష్ణా-ముద్దులకృష్ణా॥ నిలు॥

శ్రీకృష్ణ—దయగనుమానను-తల్లిరో వలవదు - కట్టకుమానను కొట్టకు
మా మన్ననచే నెన్నడెనక-ఎన్నడుతప్పుల నేచేయనునను
కట్టకుమా-నను కొట్టకుమా॥ దయ॥

40 మోహనరాగము—ఆదితాళము

గంధర్వులు—నంద-నందన-ఇందిరావనా-యిందు బ్రోవుమా॥
సుందరార-విందలోచన-బంధమోచనా
మాని శాపము-బూనియిట్టుల-హీనులైతిమి॥ నం॥
కానవార్జున-తరువులైతిమి-కంటి మీకృపచే
నీదు-పాద-నీరజాతము-లాదరంబున
మాదుమదిని-పాదుకొలిపి-మనుపుమాధవా॥ నం॥

41 ఖరహరప్రియ రాగము-ఏకతాళము

శ్రీకృష్ణ—ఔర-శారద చంద్రుడు-డలరెను-మందమార॥ ఔర॥
కైరవములను-మీరగజంజ-వారము తారక
రాజిలెను గదా
చోరుజారులు-సారశృంగార-గనమునింపుచు-మోగ
ముపెంచుచు-భూరిప్రేమనిండ॥ ఔర॥
సాధుమాన-సమ్మోరీతి చల్లదనము విల్లసిల్ల-కలువప్రేమ-
కళలధామ-కలితభూమ- ఈచందమామ-ఆకసంబునందు-
వికసించెగ॥ ఔర॥

42 జోగిసావేరి రాగము—ఏకతాళము.

గోపికలు—రారె ముదం-బారకృష్ణుంజూడగా-కోరికలింపారగా-సుద
తులార-కోరికలింపారగా॥ రారె॥
సరోజనేత్రునిన్-సరోజనాభునిన్ సరోజజాంచితున్
సరోజజార్చితున్

భామరో మా-భాగ్యమెల్లమీరగా-భక్తియుసొంపారగా-

వనజముఖీ-భక్తియుసొంపారగా॥ రారే॥

వినోదశీలుడే-మనోహరాంగుడే-వేణుగోపాలుడే- వేద

వేద్యుడే

మనసెల్లకృష్ణుని-యందునిలచి - మన్నాథు కడకేగుదము-

లలనా-వెన్నునిశరణొందుదము-కలికీ-నమోస్తుదమునునొం

గుదము॥ రారే॥

43 మోహనరాగము—రూపకతాళము.

గోపికలు—సారసలోచన మోహనరి-వరతాపసజాలలోల॥ సారస॥

యదుబాలా శృతిజాలా-మృదుపాలా శ్రీధవనీ-వరమకరుణా

భక్తినొసగి-అరసిమమ్ము-బ్రోవుదేవ॥ సారస॥

గోపాలాకరుణజూపి-పాపములన్నియు బాపి- మోక్షపదవి

మాకునొసగి-మనుపుమునో వాసుదేవ॥ సారస॥

44 సావేరిరాగము—ఆదితాళము

యశోద—శుభముమీరగా.మధురకు వేడ్క-చనుమాతనయా॥ శుభ॥

శ్రీకృష్ణ—మనం-బులో-నశో-క మే.లనోజనని

పోయివత్తునా-కనుమతినిచ్చి-పనుపవే-వలదె॥ మనం॥

యశోద—గోవింద నినుగనుచును నానంద-మునుగనితిని మోనంద

నినువిడన్-భరమమెన్-వనటచేన్-మనసునగన ॥శుభ

శ్రీకృష్ణ—మనో-వ్యసనమేలకో- జననిరో వెసన్. మరల నిన్ - కని

దనుగద ॥మనం॥

యశోద—నీ-మురిపెపుపలుకులనెపుడునువింటిఁ-దినదినమున్-మన
మునసీ-గుణములనే-ఎట్లుఁ-మేమున్-మరతుము ॥శుభ॥
శ్రీదయితుండు శుభమిచ్చుఁ-ఆమోదముగలుగును మూర్ధ
మునఁ - ఘన-యశో-మున-మరి-మము- గనువరసుగుఁ
మణి-కరుణగని ॥శుభము॥

45 ఇంగ్లీషునోటు ఏకతాళము.

కంస—ప్రబలఖడ్గధారనీశిరంబుఁజీల్చెదన్-చీల్చెదన్-చీల్చెదఁ
బ్రతికిపో-లేవు బాలకా-యీ-నా-డుఁ

నినుధరబడనలచి-మించెదఁ-మించెదఁ-మించెదన్

వైరంబారన్-పోరినినుజంపన్-భారంబంతయుతే బాయున్
వీరుఁడౌచు పెలసెదన్ - దక్కవింక బాలకా - బాలకా -
బాలకా ॥ప్రబల॥

46 మోహనరాగము-ఏకతాళము.

కమలా-నాధా-విమలవిభా-కమలా-వాసా- కలుషహారా॥
ప్రముదా-భాషా వరఫలదా - కమలా-నాభాఘనకరుణా
కరివరదా- సురవినుతా- హరివదనా-మురహారణా- సుకు
చిర నారదాది-వంద-నీయ్య-శ్రీ ॥కమలా॥

హామలోలా - సాధుపాలా - వేదలీలా సారశీలా- భాను
జాలా-మంధరధారణ - మానివిభావన- కారణ సత్కరు
ణా-సూ-బ్రి-హ్మ-ణ్య-వందితా ॥కమలా॥

మంగళం